

కళాప్రపూర్ణ, ఆంధ్ర సరస్వతి
సాహితీరుద్రమ, ధర్మప్రచారభారతి

## డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

# నా తెలుగు మాంచాల








కళాప్రపూర్ణ, ఆంధ్రసరస్వతి
సాహితీరుద్రమ, ధర్మప్రచారభారతి
డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

**NAA TELUGU MAANCHALA**
*Dr. Utukuri Lakshmi Kanthamma, Bapatla, Guntur Dt.*

---

నా తెలుగు మాంచాల
డా. ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

ప్రథమ ప్రచురణ
1981 డిశంబర్

2,000 ప్రతులు



మూల్యము.

**12-00**

ప్రాప్తిస్థానము :

1) డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ, బాపట్ల, గుంటూరు ॥జి॥
2) ఆంధ్ర సారస్వత పరిషత్తు, తిలక్ రోడ్, హైద్రాబాదు.
3) విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్, విజయవాడ.
4) విశాలాంధ్ర బుక్‌హౌస్, హైద్రాబాదు, విజయవాడ, వరంగల్.

---

ముద్రణ: అక్వేరియన్ ప్రింటర్స్, గంజ్ బజార్, సికింద్రాబాద్-500 003

# పూల తెమ్మెరలు

గుండెలోతులలో సుడిగుండమై సుళ్ళు తిరిగే వీరరసస్ఫూర్తి, ఒక శుభతరుణంలో తెలుగుల యింటిపడుచైన మాంచాల రూపమున పొడగట్టి వెన్ను దట్టినది. ఉత్సాహము చలికితమై ఒడలు పులకింపగా వీరరసము పెల్లుబికి, ఉప్పెనగా వెల్వడి, నా లేఖిని నుండి అమృతంపు తేటయూటగా ప్రవహించి, 'నా తెలుగు మాంచాల'గా పేరొందినది.

భారతదేశ చరిత్రపుటల యందు ఒడలెఱుగని వీరావేశమునకు తెలుగు లోక చెఱగని ముద్ర వేసిరి. అది భద్రాసనమగుటకు రుద్రమ్మ, గంగా దేవి, చానమ్మ, ప్రోలమ్మ, మల్లమ్మ, మాంచాల ముందుగా గల, సాహసికు రాండ్రైన వీర నారీమణుల, స్వజాత్యభిమానముతో, స్వదేశభక్తితో కూడిన నిద్రింపనీయని, నిర్మల ప్రోత్సాహమే కారణమేమో.

ఈ 'అబలల' అమలినోదంతములు, తెలుగుల జాతి చరిత్రలో వెలుగులు నింపినవి. ధర్మవీరమునకు తళుకుటద్దములై ధరిత్రియందు ఆదర్శములను ప్రతిబింబింప జేసినవి. వెన్నుజూపని వీరయోధులుగా, కాకలు తీరిన కాకతీయుల కదనపాండితికేమి, శత్రుతండములకు భయోత్పాతముతో కంపరము పుట్టించిన కంపరాయల ఖడ్గచాలన నైపుణికేమి, ఈ వీరకాంతల పిఱికు జూపని సాహస ప్రవృత్తియే తెలుగుల తెగువరితనమునకు కప్రంపుహారతి పట్టినది.

ఊర్పులు దీయుటకు సైతము ఊరుకొనని, ఈ యుద్ధోత్సాహ వ్యూహ రచనా సంవిధాన సంపుటములలో, మెఱుగులు తరగని తన మేలి సాహస గాథను, ఊహాలకతీతముగా, తనకు మాలిన ధర్మాచరణముగా సాగించి, రంగప్రవేశమొనర్చి, వీరరసావేశ నిర్భరయైన నాట్యావతార మూర్తిగా రూపొంది విశాల వసుంధరా నభోభిత్తికలపై, తెలుగు తెరవల తెంపరితనమును పరవళ్ళు ద్రొక్కించి, ధ్రువతారగా మలచిన కీర్తి, పదునైన గుండె బలము కల, పదునారేండ్ల పసిడి మొగ్గ, మగువ మాంచాలకే దక్కినది.

ఇక, తన మగువ, తన్ను వెన్నుదట్టి, తనకు కండ్లు తెరపించి, తన దక్షిణ హస్తమున ఖడ్గమిడి, శత్రు కంఠ లుంఠన మొనర్చి, తడియారని రక్తపుటేరులకు నాగలిచాలు దీర్చుటకై, కదన భూమికికదలి, ముమ్మొన వాలుకత్తితో, ముమ్మర సమరమున, వీరరసాలింగితుడై, జయమంది, తానుగా మఱచి వచ్చి శృంగార రసావేశ నిర్భరతను, తన్నాలింగనమొనర్చి పారవశ్యము కల్పింప వలెనని, ఆనయిడిన, తన చాన, మాంచాలతో బాటుగా బాలచంద్రుడును, ఆంధ్ర చరిత్రలో శాశ్వతస్థాన మందినాడు.

మఱి యిది విప్రలంభ శృంగార గాథయో, శౌర్యరస విస్ఫులింగము లను వెదజల్లు చౌకాటపు వీరగాథయో! ఆయా సమావేశములలో జరిగిన కావ్యపఠన శుభ తరుణములలో మహోన్నత వీర శృంగార రసములిందు పొంగులు వారినవను ప్రశంసనందినది అదినిజమేనేమో. అంతర్జ్వలిత ములై పొగలెగయుచు సెగలు క్రక్కుచున్న, ధర్మలులితము కాని వీర శృంగారములే ఊర్పులు కాగా, బాల మాంచాల, నాయికగా ఈ కావ్యమున ప్రాణప్రతిష్ఠనందినది. స్వార్థమును ఏడిన ధర్మవీరమును తపస్సుగా పండిం చిన ఉదాత్త తరుణి ధర్మమును ఆమె నేల నాల్గుచెరగుల వెలయింప జేసినది. అట్టి ఉత్తమసతి, పతివ్రతా ధర్మమునకు రక్త తిలకము నిడి వీరరస తేజః పుంజముతో ఆంధ్ర మహిళా చరిత్ర పుణ్యక్షేత్రముల వెలుగు బాటలు పఱ చినది! ఆ మహోన్నత వీర నారీరత్నమునకు నాయొసపిన కొలది రసోదంచిత మగు ఔపచారిక భక్త్యారాధనలను తోరణ మాలికలుగా నమర్చి, నా స్వభావశీల ములకు సహజాలంకారమైన వీర రసోద్రేకమునకు తీర్చిన రూప కల్పనగా ఈ కావ్యరచనకు పూనుకొంటిని.

కావ్యరచన యింకను పూర్తికాక ముందే మాన్యులు, పూజ్య సోదరులు డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారు, నా ఆహ్వానమును మన్నించి, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి స్మారక సంచికావిష్కరణమునకు బాపట్ల

కేతెంచిన సమయమున మా యింటికి విందై మా ప్రాంగణమునలంకరించి, వీనుల విందుగా ఈ కావ్యబాలా విస్ఫూర్తిసుధను గ్రోలి ఈ కృతిస్వీకృతికి ఆమోదమును తెల్పుడని నేనభ్యర్థింపగా, ప్రమోదముతో, తమ యామోదమును తెల్పి ఆనాడచట ఆసీనులైన సహృదయ సభాస్తారుల సమక్షమున కృతిస్వీకార మొనర్చిరి. రసరాట్టైన వారి హృదయకేదారమున సౌరభ పరీవాహముల విరజిమ్మిన సౌందర్యకమలమై విరాజిల్లిన ఈ కావ్యబాలకు నేను జనయిత్రినగుట నా భాగ్యమని ఆనందించుచున్నాను.

ఆ సౌజన్యమూర్తికి నా యెడలగల అపారాదర గౌరవములకీ కావ్య స్వీకారాంగీకారముతో చక్కని రూపకల్పన చేసిన వారి ఔదార్యమునకు నా వినమ్రాంజలి. సౌహృదయ శిరోమణియైన డా॥ గోపాలరెడ్డి గారి ఆశీస్సులతో ఈ కావ్యబాల శుభంకరమైన భవితవ్యమును తీర్చి దిద్దుకొన గలదని ఆశించు చున్నాను. అభినవ భక్తపోతన, మహాకవిశేఖరులు, సౌజన్యమూర్ధన్యులు ఆంధ్ర కవిపండిత లోకమునకొక అలంకారమణి యనదగిన రసతపస్వి మాన్యులు శ్రీ వానమామలై వరదాచార్యులుగారు, ఎంతో వాత్సల్యాతిశయముతో "ఇంత చక్కని గేయ కావ్యరచన, నా చూచినంతవఱకు మృగ్యము" అని శుభాశీః ప్రశంస నొసగినందులకు భక్తి తాత్పర్యములతో కైమోడ్పు లర్పింతును.

సోదరి, ఆంధ్ర విశ్వవిద్యాలయాచార్యయైన సౌభాగ్యవతి కోలవెన్ను మలయవాసిని గారు నా యందెంతో ప్రేమతో ఈ కావ్యమునకు 'నీరాజన' మిడినందుకు, వారికిని నా ధన్యవాదములు.

ముందువేసగిని మల్లియల సువాసనను మోచి కొని వచ్చు మలయ పవనునకు హాయిగా స్వాగతము పల్కు ఆంధ్ర మహాజనులు, తమ వీర చరిత్ర యందు స్థిరసౌదామిని యగు కాంతిరేఖగా, నిత్య సువాసనలను దశదిశలకు

వ్యాపింపజేయు పూల తెమ్మెరగా ఈ కృతిబాల కాదరానందములతో శుభా శీషముల నొసంగి మన్నింతురని ఆశించుచున్నాను.

ఇంకొక్క మనవి. ఈ కావ్యరచన యందు యతిప్రాసల నియమము నిర్బంధముగా పాటింపబడలేదు. ఎక్కడనైనను అశ్రద్ధ వలన మాత్రా నియమమునకు భంగము కల్గినదేమో, చెప్పలేను అవి యేవో నా అల సతవలన దొరలిన ప్రమాదములు. అవి మిక్కిలి తేలికగా, కొద్దిపాటి సవర ణలతో పరిష్కరించుకోదగినవే యైయుండును. ఆ నా లేఖన ప్రమాదము లను సవరించుకొనుడని ప్రార్థించుచు దోయిలించుచున్నాను.

ఏమో మఱి సోదరుడు పాండురంగయ్యకు నా యెడల యెంత అపూర్వ గౌరవమో! నేనెంత ఏమరుపాటును, ఆలస్యమును గావించినను, ఎంతో ఓపికతో నా యీ కావ్యమునే కాక, శ్రీ మా నాయనగారు, కీ. శే. ధుర కవి నాకము కృష్ణరావు గారి శతజయంతి కావ్యములను కొన్నింటిని కూడా చక్కగా ముద్రణ చేయించి, నాకు చెప్పనలవికాని సహాయ సహకారముల నిచ్చి తోడ్పడినాడు. ఆ సోదరునకు నా ధన్యవాదములు.

ముచ్చటగా ముద్రించి యిచ్చిన సికిందరాబాదు నందలి ఆక్వేరియస్ ప్రింటర్స్ అధినేతలైన శ్రీ బషీరు అహ్మద్ గారికి నా ధన్యవాదములు.

ఇదివరల నేను ప్రచురించిన పెక్కు కృతులకు ప్రూఫులు చక్క దిద్దిన పెద్దలు పూజ్యులు శ్రీ చీమకుర్తి శేషగిరిరావు గారికి నా కృతజ్ఞతాంజలి.

మగువ మాంచాల అతిమానుష పౌరుష భావోద్దీపనమునకు ఏకైకో దాహరణమైన - భర్తచేతికి ఖడ్గమిచ్చి యుద్ధమునకు సాగనంపిన - ఘట్టమును కండ్లకు కట్టినట్లు చిత్రించి ముఖపత్రాలంకారముగా కైసేసి యిచ్చి కావ్యశోభ

యినుమడింప జేసిన ప్రసిద్ధ చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజు సోదరులకు నా ధన్యవాదములు.

ఇంక కడపటగా ఈ క్రింది గేయముతో ఈ కావ్య ప్రస్తావనమును ముగించుచున్నాను.

సిరిగజ్జె మ్రోయంగ, హరివిల్లు విరియంగ
రసమయూరము లిందు, రమణీయగతితోడ
వీరశృంగారములు, తొలుసగొట్టిరేగంగ
పులకరింతలు గలుగ పురివిప్పి యాడినవి.
సిరిమల్లె నవ్వంగ, పరువములు సెలగంగ
గండు కోయిల లిందు చెలరేగి పాడినవి.
తన రూపు భావించి, తన్మయుండై తాను
సంగరము మఱచి, మది బొంగరమువలె తనకు
ప్రదక్షిణములు సలుపు దక్షిణ నాయకుని
తన విభుని దైన్యమును, సహియింపగాలేక
ఊకొనక నిట్టూర్చె, చీకొట్టె యా చెలువ
మగతనము రేకొట్టె, కోరికల జోకొట్టె.
మగని ననికిని పంపి, మగువ తా ననికరిగె
ఆ మగువ మాంచాల, వీరరస పాంచాల
చరితమ్ము రచియించి, ధన్యత్వ మందితిని
తనువు పులకింపంగ ఆనంద మొందితిని.

బాపట్ల
తేది. 25-11-1981.

అంజలితో
మీ సోదరి
లక్ష్మీకాన్తమ్మ

కళాసామ్రాట్

## డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు

చాంద్రీకృతమైన కళా సౌరభం, అంతశ్చేతనను సుసంవాసితం చేస్తూంటే, సుభగంభావుకుడైన రసస్నిగ్ధమూర్తిగా రూపొంది జీవితాన్ని ఉజ్జ్వలంగా మలచుకొన్న మహామనీషి, బహుదొడ్డ మానిసి డాక్టరు బెజవాడ గోపాలరెడ్డి గారు!

తన తనయుని ఘనతను గాంచి, తెలుగుతల్లి ఉప్పొంగి పోవు నంతటి తేజస్వి మాన్య సోదరులు డా॥ బెజవాడ గోపాలరెడ్డి గారు!

రసతపస్వియయిన డా॥గోపాలరెడ్డి గారికి, సకల కళారంగముల యందు గల అధికారకములైన ప్రజ్ఞాప్రావీణ్యములే వారికి భారతదేశము నందుగల సకల కళా సంస్థల యందు ఆధిపత్యమును లభింపజేసినవి.

విశేషించి సాహిత్యరంగమున వారికిగల ఆదర గౌరవములు, అపారములు! ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షులుగా సకలాంధ్రమునందలి ఉదాత్తసాహిత్య చైతన్యమంతయు వారి హృదయోద్యానమున వికసించిన పరిమళ పారిజాతములు వెదజల్లు సౌరభములే. కావుననే ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షతయే కాదు, నోబెల్ సంస్థవంటి జ్ఞానపీఠముకూడా వారి అధ్యక్షతనే వరించినది! ఇది వారి సాహిత్య కళా సామ్రాజ్యాధినేతృత్వమున కొక చక్కని రూపకల్పనము!

శాంతినికేతనమునందు గురుదేవుడైన రవీంద్రుని అంతేవాసిత్వము వారి గుండెలలో నిద్రించుచున్న, రసపిపాసను, సౌందర్యోపాసనను

ప్రబుద్ధ మొనర్పగా, కవిగా, కళారాధకుడుగా మాతృభూమిని కాలిడి, రవీంద్రుని సాహిత్య సౌందర్య ప్రభావీచికలను తెలుగు జాతికి కాంతితోరణ మాలికలుగా ప్రసాదించిన యశస్వి, డా॥ గోపాలరెడ్డి గారే. వారి హృదయ కేదారము నుండి, యుప్పతిల్లిన రవీంద్ర సాహిత్యానువాద కావ్యసస్య సంపద తామరతంపరగా వెలయించుచు ఆంధ్రభారతీ సేవా తత్పరతతో విరాజిల్లుచున్న డా॥ గోపాలరెడ్డిగారి జీవితరంగమున, మహాత్ముని పిలుపు జాతీయోద్యమ సేవాతరంగముగా పెల్లుబికి, మాతృ భారతీ సమరాధనా తత్పరు నిగా నొనర్చినది. చిమ్మ చీకటి వానలు ఏకధారగా కురిసి నేలయంతయు చిత్తడి చిత్తడిగానై మిఱ్ఱులు పల్లములు తెలియరాక భారతజాతి అంధకార మున మ్రగ్గుచు అధఃపతనము చెందుచున్న దుస్థితిని గాంచి బాల్యముననే చలించి పోయి, సత్యాగ్రహోద్యమమున నుఱికిన బాలయోధ, డా॥ గోపాలరెడ్డి గారు!

పాఠశాలనుండి మఱలి యింటికి వచ్చుచునే విద్యార్థుల కోరికపై, వారి యుద్యమమునకు నాయకత్వము వహించి, కారకేగి, భారతీయుడుగా కర్తవ్య మును నిర్వహించిన మహావ్యక్తి, ఆయన!

జాతీయోద్యమమున కాకలు తీరిన మహాయోధుడుగా, రూపులు తీరి రాజాజీ నాయకత్వమున ఆర్థికమంత్రిత్వమును స్వీకరించి, కాలక్రమమున, ఆంధ్ర ముఖ్యమంత్రిగా, ఉత్తర ప్రదేశ్ గవర్నరుగా అసంఖ్యాకములగు ఉన్నత పదవుల నలంకరించి, భారతమాతను సేవించి. మాతృణమీగిన మాన్యయశస్వి; డా॥ గోపాలరెడ్డి గారు!

ఆంధ్ర సాహిత్యోద్యానమున కల్పవృక్షమై భాసించుచున్న ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ, స్థాపకాధ్యక్షులైన డా॥ గోపాలరెడ్డి గారి అఖండ నేతృత్వమున రజతోత్సవపు వేడుకను నిర్వహించుకొననున్నదన, ఆ మహా సంస్థకు, సచివుడును, సారథియునై దానిని వారు అన్ని విధముల ప్రోది

చేయుట చేతనే, సాహిత్య అకాడమి అంత మహాసంస్థ యైనదనిన అతిశ యోక్తి కానేఱదు.

సాహిత్య పోషణ మొనర్చుటతోనేకాక "ప్రాయమింతకు త్రైవాలక యమున్న" డా॥ గోపాలరెడ్డి గారిపుడు ఉజ్జ్వల కవితా రచన చేయుచుండుట. వారి సాహిత్య కళారాధనా తత్పరమైన, హృదయ సంస్కారమునకు ప్రతి బింబ మనుట అతిశయోక్తికాదు.

ఇంత సౌమనస్యము పండించుకొని, తెలుగునేల నాలుగు చెఱగుల కళాసామ్రాజ్యాధిపత్యము నెఱపుచున్న మాన్య సోదరులు డా॥ బెజవాడ గోపాలరెడ్డి సోదరులు,నా కావ్యబాలను, తమ బాలగా నంగీకరించి ఆ బాలకు తమ అఖండ సాహిత్య సామ్రాజ్య వారసత్వమొసంగుటకు నెనరూని, అను మోదము తెల్పిరనిన, అది నా భాగ్యము!

ఈ వారి సౌజన్యమునకు కేల్మోడ్చుచు వారి షష్టి పూర్త్యుత్సవ సంద ర్భముగా సాహిత్య అకాడమీ నిర్వహించిన ఉత్సవ సమయమున నేను వారి కర్పించిన గేయమునిచట ప్రస్తావించుచు ఈ ప్రస్తవమును ముగించుచున్నాను.

గోపాలుండవతరించెనే
మఱలభువిని
గోపాలుండవతరించెనే
రూపాధిక సౌమ్య మూర్తి
దీపాయితరమ్య కీర్తి

గోపాలుండవతరించెనే
రాజ
గోపాలుండవతరించెనే

సురుచిరాత్మ భావసుభగ
గోపికల హృదయ వేణు

నాదసుధా స్మృతులు సెలగ
మాధుర్యము పురులు విప్ప

గోపాలుండవతరించెనే
మధుర
గోపాలుండవతరించెనే

సుందరతా స్వాదు పథలస
చ్ఛందోహృది వక్రింపగ
ఆనంద శ్రీకందము
రసవేదంబుద్ధరింప

గోపాలుండవతరించెనే
బాల
గోపాలుండవతరించెనే

జనజీవన కాళిందిని
ధనవిచల త్స్వార్థాశయ
విషకాళిక దొలగించియు
నిర్విష జీవశ్రీ పెంచగ

గోపాలుండవతరించెనే
వేణు
గోపాలుండవతరించెనే

మధురమధురకవితాప్రియ
నవసీతము నాహరించి
కవి సామ్రాట్సఖిబృందపు
కైవారము లందుకొనగ

గోపాలుండవతరించెనే
రసిక
గోపాలుండవతరించెనే.

# కృతి సమర్పణాంజలి

సాహిత్య సభాధ్యక్షుడు
సౌహృన్మహిమానుభావ సంపన్నుండై
దోహల కవితాశక్తి స
మాహితుడై, రెడ్డివిభుడు యశమును గాంచెన్.

గోపాలరెడ్డి గారికి
దీపిత సాహిత్య విభవ దివ్యాకృతికిన్
నా పావన కృతి, మాంచా
లా పౌరుష చరిత మిత్తు లావణ్య ప్రభన్.

ఏ వంవి ధరసబంధుర
భావోన్నత విమలమతికి వైభవరతికిన్
సేవిత సకల కళా సం
భావిత మూర్తికిని నిత్తు పరిమళలహరిన్.



# దాతలకు కృతజ్ఞత

'నాతెలుగు మాంచాల' కావ్యానికి ఘనమైన ఔదార్యంతో ముద్రణకు

ఆర్థిక సహాయమొనర్చిన

శ్రీ ధర్మమూర్తి రావుబహదూరు కలవల కన్నన్ చెట్టిచారిటీస్(మద్రాసు)వారికి

సహృదయులు, సేవాపరాయణులు

శ్రీ కబళవాయి రాధాకృష్ణరావు (హైదరాబాదు)వారికి

కృతజ్ఞతావందనములు

# శుభాశీస్సు

నేటి కవయిత్రీమణులలో తలమానికముగా నలరారు పూజ్యురాలు డా. ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ కళాప్రపూర్ణ గారిచే రచింపబడిన 'నా తెలుగు మాంచాల' యను నేతత్కృతిరాజమును, నేనామూలాగ్రముగా చదివి, మిక్కిలి ప్రభావితుడనై యీ క్రింది నాలుగు మాటలు వ్రాయుచున్నాను.

ఇందలి కథానాయిక మాంచాల వీర నారీమణి, అపూర్వ లావణ్య రాశి, మాతృదేశ పరిరక్షణార్థమై, ఆహవభూమిలో అడుగూని, వీర కేళీవిహార మొనర్చి, విజయలక్ష్మిని పరిగ్రహించుటకై, పయనముగట్టి, తన విభుడు బాలచంద్రుడు, మాతృప్రేరితుడై, తన యియ్యకోలునకై యేతెంచినప్పుడు ఆమె అతనిని యుద్ధమునకు పురికొల్పి పంపించిన ఘట్టము; ఈ కథకు ఆయువుపట్టు. ఇందలి ప్రధాన రసము వీరము. ఈ కృతిలో కవయిత్రీమణి, మాంచాలతో పలికించిన ప్రతి పలుకు ఒక బ్రహ్మాస్త్రమై, తాత్కాలికముగా దిగజారిపోయిన బాలచంద్రుని హృదయశైథిల్యమును చీల్చిచెండాడి, అప్పటి కప్పుడు, అతని గుండెల్లో, వీరక్షాత్రపౌరుషాగ్ని జ్వాలలను రేకెత్తింపజేసి అతనిని, కదనరంగమునకు కదలింప జేయునదై యున్నది.

ఇందలి ఇతివృత్తము అతి చిన్నదైనను, కథన శైలి, రచనా శిల్పము, అక్షీణ వీరక్షాత్ర సంపదను, అక్షరరూపమున చిమ్ముచున్నది. ధర్మవీరము బలము పుంజుకొన్నదై, బాలచంద్రునిలో ప్రళయరుద్రుని సృష్టింపజేసినది. పదపదమున, అక్షరాక్షరమునను వీరరసస్ఫోరకమైన పౌరుషము మూర్తి గొన్నదై, పరవళ్లు ద్రొక్కినది.

ఇందు అపూర్వ సౌందర్య, సౌకుమార్యరాశియైన మాంచాలాదేవి మధురహృదయములో మఱుగుపడియున్న వీరక్షాత్రము పెల్లుబికి శివమెత్తి తాండవించినది.

ఇక బాలచంద్రుడో పెండ్లిసందడిలో మాంచాలను తొలిచూపులో ఏమి చూచినాడో ఏమోకాని, తిరిగి యేడేండ్ల పిదప, అదే మలిచూపుగా, ఆ అపూర్వ సౌందర్యరాశిని చూచి పరవశించి, ఆమె రూపలావణ్యాలను అనిదంపూర్వరీతిలో భావించి వర్ణించినాడు. ఆ వర్ణించిన తీరు అపురూపము; సరి క్రొత్త యుత్ప్రేక్షాలంకారములతో, ఆయమ అంగ ప్రత్యంగములను, అతి నూతన ఫక్కిలో అద్భుతశైలిలో అత్యంత మనోహర శిల్పసౌందర్యముతో, అత్యుదాత్త శృంగార ధోరణిలో వర్ణించి ఈమె ఒక క్రొత్త రికార్డును స్థాపించిన దనుటలో అత్యుక్తిలేదు. ఇంతకు ముందటి మహాకవులెవ్వరును, త్రొక్కని ఒక విచిత్ర విస్మయాత్మక ఫక్కిని, ఈ మాంచాలా వర్ణనము లోకోత్తరముగా నడచినది. ఇందు ఈమె చూపిన ప్రత్యేక విశిష్టత అత్యంత ప్రశంసార్హము.

ఉదాహరణము:- కలకంఠి కంఠమున
కొలువున్న గీర్వాణి
వీణియను గెల్కొల్పు
వజ్రపేటికోపరి
భద్రకవాటములన
పెంపెందు బింబోష్ఠి
పెదవులే ఒక యెత్తు
అధరయుగళము దెలుప
మధుర మంజుల రీతి
శ్రుతిరుచిర గీతికా
ఋతులగుచు వెలుగొంది

దంతపంక్తుల కాంతి
దొంతిమల్లియ నవ్వ
హితము నుపదేశించు
మితభాషి, శుకవాణి
మురువు హరువులు గులుకు
పలుకులును పైయెత్తు"

ఇట్లశ్రుతపూర్వ సౌందర్య ఫణితి కల వర్ణన లెన్నోకలవు.

పాత్రౌచిత్య సంభాషణ, పదగుంఫనాచాతురి, అనల్ప శిల్పకల్పనా నైపుణి, అత్యాకర్షణీయమగు ఉక్తి చమత్కృతి, రసస్ఫూర్తి ఈ మున్నగు విశిష్టలక్షణములతో నలరారుచు ఈకృతి చదివినకొలంది, యింకను చదువ వలెనను మధురకాంక్ష నూరించునదై, సర్వాంగసుందరముగా. నలరారిన దనుట నిర్వివాదాంశము.

కథను సుందరముగా మలచుకొనడములో ఈమె అవలంబించిన తీరూ, సన్నివేశకల్పనములోని సౌరూ కావ్యమునకు మరింత వన్నెకూర్చినవి.

ఎందుకు క్లిష్టాన్వయ వాక్యములు లేక ఈయమ రచన, మిక్కిలి రస వంతముగా, స్ఫూర్తిమంతముగా, చక్కగా సాఫీగా సాగిపోయినది.

ఇంత చక్కని గేయకావ్యరచన, నా చూచినంత వఱకు మృగ్యము!

ఈ కవయిత్రికి కల బిరుదములన్నియు సార్థక మనుటకు ఈమె ఈ ఒక్క కృతి చాలు!

ఈ కృతి మన తెలుగు సరస్వతి కపూర్వ నూత్నాలంకృతి! ఈయమ బిరుదములలో ఆంధ్ర సరస్వతి యను బిరుదము మఱీమఱీ అన్వర్థమై అల రారుచున్నదని నా ఆశయము.

ఇట్టి కవయిత్రీమణులను గన్న మన యాంధ్రి యెంతో ధన్యురాలు!

భగవాను డీయమ్మకు చిరాయురారోగ్యములు ప్రసాదించి, యీామెచే ఇట్టి అమూల్య కృతులను ఇంకెన్నిటినో రచియింపజేయుచు మా తెలుగు తల్లికి మురువు హరువులు గూర్చు గాక అని యాశించుచు శుభాశీస్సుల నంద జేయుచున్నాను.

విద్యావాచస్పతి

**వానమామలై వరదాచార్యులు.**

# నీరాజనము

"ప్రాగ్విపశ్చిన్మతంబున, రసము వేయి
రెట్లు గొప్పది, నవకథాదృతిని మించి"

అనునట్లు, వీరరసము నారీరూపమున సాక్షాత్కరించిన కథ; మాంచాల ఉదంతము! స్వయముగ కత్తిపట్టి కదనరంగమున, వీరవిహార మొనర్చిన, వీరనారీమణులు చరిత్రలో చాలమంది కలరు. యుద్ధముపై బుద్ధివీగి, కామాతురుడగు, కాంతునకు. కర్తవ్యోపదేశము చేసి, వీరభావన కల్గించి, ఆచంద్రార్కము బాలవీరునిగా కీర్తిని, కూర్చిన, సతీమణి, మాంచాల!

తులసీదాసు, మహాభక్తుడుగా మహాకవిగా, రూపొందుటకు, ఆతని భార్యయొక్క ప్రబోధమే కారణము. కానీ అచట ఆ ప్రబోధము, ప్రాణము లను పణము పెట్టవలసినది కాదు. ఇట మాంచాల పదునారు వసంతములు నిండని పసిడిమొగ్గ! అగుగాక-ఆమె, వయసున పిన్నయయ్యు, కర్తవ్యమును ప్రబోధించుటలో గడితేరిన వీరవిదుషీమణి యైనది- అట్టి మాంచాల మన తెలుగుల ఆడబిడ్డ యగుట మన అదృష్టము!

ఆ మాంచాలను- 'నా తెలుగు మాంచాల' అను పేర, అక్షరరమ్యముగ కీర్తించినారు; కళాప్రపూర్ణ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మగారు!

స్వదేశాభిమానము, స్వజాత్యభిమానము, అడుగంటి పోవుచున్న నేటి కాలమున 'నా' అను భావము, అటు తెలుగునకు, ఇటు మాంచాలకు అన్వ యించునట్లు 'నా తెలుగు మాంచాల' అను పేరు, రచయిత్రికి గల జాత్య భిమానమును చెప్పక చెప్పుచున్నది.

గేయానుకూల ఛందస్సుతో ప్రారంభించి పాటవెలదిని పరికించి, సీసపు నడకలో మాంచాల నడకపేర్మిని జూపి, తమ రచనను, సాగించి నారీమె.

ఐతాంబ, బాలచంద్రుడు, మాంచాల— ఇందలి ప్రధాన పాత్రలు.

ఐతాంబ, బాలచంద్రుని పెంచి, పెద్దచేసిన విధానము, బాలచంద్రుని నోటనే కవయిత్రి కడు రమ్యముగ పలికించిరి

"పిన్న వయసున నుండి
పెద్ద భావన చేసి

... ... ...

ఊర్పుతో శౌర్యమ్ము
దీర్పగా నేర్పితివి
యుద్ధవిద్యలను నా
కుగ్గుగా గుడిపితివి
అస్త్ర శస్త్రములతో
ఆటలాడించితివి"

ఇట్లు తనయుని వీరయోద్ధగా పెంచినది-

కాని, తనయుడు యుద్ధమునకేగు సమయ మేతెంచుసరికి, ఆ తల్లి ప్రాణము తల్లడిల్లినది. కొడుకు ప్రాణమేమగునోయని ఆందోళనపడినది. అతడు రణరంగప్రవేశము చేయకుండ ఆగబట్టుటకై వేరుపాయమాలోచించి నదట ! పుత్రమోహంబు సామాన్యంబు కాదు కదా ! మాంచాల సౌందర్యము నకు కట్టుబడునను నమ్మికతో కొడుకును భార్య దీవెన లందమని అచటి కంపినది.

ఆ తల్లిధీరత్వము పుత్రుని వీరుని పెంచువరకే పరిమితమైనది.

కాని మాంచాల ధీరత్వము, అత్తధీరత్వము కంటె సమగ్రమైనది.

బాలచంద్రుడు పెండ్లయిన, బహువత్సరములకు భార్యను చూచుటకా మందిరమునకు వచ్చినాడు. అప్పట్టున ఆమె మదిలోని భావపరంపరలను కవయిత్రి కమనీయముగ చిత్రించినది. పతివిలోకన సమయమున,ఆ మాంచాల "చూపుచూపున కురిపించిన" భావపరంపరలను, వివరించిన రీతి ఆలంకారిక మర్యాదలను లోగొను రీతిగ నున్నది-

మాంచాల మాటలుగా :-

"భవదాగమన గాథ
పదునైన నా గుండె
కుదిలించి రక్తిమలు
కుప్పలుగ బోసేను."

ఉన్న ఈ పంక్తులలో భాషకందని భావనలను చిత్రించినారు, కవయిత్రి!

కవయిత్రి చేసిన వర్ణనలన్నియు ఒక యెత్తు, మాంచాల సౌందర్య వర్ణన ఒక్కటి ఒక యెత్తు.

మచ్చునకు :-

"అందచందము లన్ని
అందఱును చదువంగ
వర్ణించి, లిఖియించు
అద్భుతాద్భుత కావ్య
రమ్యాక్షరమ్మొ్మచు
బాలికామణికమ్ర,
ఫాలమ్మునందేర్చి
కమ్మకస్తురి దీర్చు
తిలకమ్ము పై యెత్తు"

మాంచాల సింగారమిట్లు రమ్యమైయుండ, లక్ష్మీకాంతమ్మగారి కవిత, మధురమైన తెలుగు పలుకుబడులతో నిండారి యున్నది.

గరగరని, కొందలమ్మందును, కసిమసగి, పిఱికిమందులు, పిఱు వీకు, తను వానె మఱచె, సిగపూవు పైయెత్తు, చీకట్లు చీకొట్టు, 'భళ్లమంచు తెల్లవారె', భాగ్యమ్ముపండు వంటి పలుకులు కోకొల్లలు.

పసపాడు నొదలి పస
ఎసలారు నుదుల పస
వసవొల్చు తలపు పస
పసమీరు పడతి పస"

ఈ పాదములు లక్ష్మీకాంతమ్మగారి తెలుగు కవిత్వపు పసను పట్టి చూపుచున్నవి.

"ముగ్ధతాపసి" యను వీరి మాంచాల, ధీరవచనములతో, బాల చంద్రుని, మాతృదేశ సేవోన్ముఖుని చేసి వీరస్వర్గమలంకరించిన పతితో, సహగమనముచేసి, సతియైనది-

"మాంచాల ఘనకీర్తి
మంటతో, తా గలిసి
మింటి కెగసెను గాదె"

అను వీరి వచనము ప్రత్యక్షరసత్యము. తెలుగుజాతి కీర్తికి ఆ పుణ్య సతిబూది, వెలలేని, తులలేని పాదయ్యేనట.

చివరిగా ఆ వీరసతిని ఈ కవయిత్రి

"నా తెలుగు మాంచాల
నాటెంపు పతిశీల

స్తవ నీయ గుణలోల" అని కీర్తించిరి.

స్వభావోక్తిరమ్యమగు ఈ పల్కులు సర్వదా, సర్వథా గణనీయములు తెలుగుకీర్తి తేజరిల్ల ప్రాణత్యాగమొనర్చిన మాంచాలకథ నవనవోన్మేషమైనది- నిత్యనీరాజనముగా ఆంధ్రులు కళ్లకద్దుకొన వలసిన వీరగాథ యిది:

ఆ వీరగాథనిట్లు రమ్యముగ కీర్తించుటతో విదుషీమణి, కళాప్రపూర్ణ లక్ష్మీకాంతమ్మగారి కవితయు, జన్మయు ధన్యమైన వనిన అతిశయోక్తి కానేఱదు.

ఆ "నా తెలుగు మాంచాల, నాఱెంపు పతిశీల"

కాగా

ఈ "నా తెలుగు మాంచాల నాఱెంపు కవితాలవాల" మనవచ్చును.

కోలవెన్ను మలయవాసిని.

# నా తెలుగు మాంచాల

## ప్రస్తావన

బాలచంద్రుని సంగ్రామ వాంఛ—

నలగామ విభునితో
మలిదేవ భూపతికి
వైరమధికమ్మగుచు
పోరునకు కతమయ్యె

... ... ...

తన విభుడు, మలిదేవ
ధరణిపతికిని, యుద్ధ
విజయమును గూర్పంగ
వేనవేలగు సైన్య
వాహినుల గొంపోయి
పావనమ్మగు మాతృ
దేశాభిమానమ్ము
తీవ్రమై, నడిపింప
నలగామ రాజుతో
నాగమ్మ మంత్రితో
బహు బాహు బలశాలి
బ్రహ్మనాయడు పూని
ఆహవ మ్మొనరింప
ఆనందమున వెడలె

* * *

కదనమ్ము సేపేటి
కాంక్ష తీవర మగుచు
తీంౘ్రడింప, దీక్షగొని
తంౘ్రడి పోయిన చాయ
తానేగవలె ననుచు
రాణువం గై కొనుచ
రణము సేయగ నెంచి
ౘ్రబహ్మనాయని తనయు
డా బాలచంౘ్రదుండు
అతను తను సుకుమారు
డాహవ భీషణుండు
జనని దీవన గొనుచు
జయము తా బడయంగ
తల్లి యైతాంబ కడ
కుల్లసమ్ముగ నేగె

*   *   *

రంగము

## ఐతాంబ మందిరము

**బాలచంద్రుడు—**

"జోహారు గొనుమమ్మ !
ఓ వీరమాత ! నీ
వీరపుత్త్రుం డిదే
చేరి కొలుచుచు నుండె
దీవించి పంపవే
దివ్యభావము తోడ !
మాతృభూమికి సేవ
మాన్యరీతిని సల్పు
తలపు కల్గెను ; తల్లి !
తనయుండు విజయియై
అనినుండి, ఆనంద
పరవశత నేతేర
పరమ భావోద్దీప్తి
గరగరని క్రక్కదల
గరువతన ముప్పొంగ
విజయ కేతన పంక్తి
వినుపీథి వెల్గింప

మంగళార్తిక ప్రభలు
నింగి ముట్టుచు పొంగ
స్థైర్య భావము మెఱయ
ధైర్య హేమాద్రి యౌ
పరమ సాహసి తండ్రి
బ్రహ్మనాయని చేరి
పోరుసల్పగ నన్ను
వీరమాతా యిపుడు
దీవించి, పంపవే
నీ సుతునకున్ జయము
భావించి, యంపవే

*   *   *

## ఐతాంబ హృదయము—

అని పలుకు తన తనయు
రణ సమారంభమ్ము
సంగ్రామ వాంఛయును
సాహసిక భావమ్ము
మదిలోన నూహించి
కొదమ సింగము బోలు
కొడుకు దుడుకును దలచి
కొందల మ్మందుచును
కొడుకుపై మోహమున
తల్లి యైతాంబ కడు
తల్లడం బందేటి
యుల్లమ్ముతో ప్రీతి
యుల్లసిలగా సుతుని
అక్కునను జేర్చుచును
మక్కువలు గదురంగ
శిరము మూర్కొని, ప్రేమ
నురము నందలి హార

తతుల సవరింపుచును

... ... ...

రతి రాజు మెచ్చేటి
రణ శాస్త్ర కోవిదుని
తన తనయు గనుగొనుచు
కళవెల్ల దీరంగ
కాంక్ష ననలెత్తంగ
నాదలెల్ల పుడుకుచును
కడు ప్రేమ లాలించి
కరములను దానెత్తి
నెఱి కురులు సవరించి
శిరసు మూర్కొని ప్రేమ
తలను మెటికలు విఱిచి
తల్లి యెతమ పలికె

* * *

ఐతాంబ బాలచంద్రునితో—

"మార సుందర దేహ !
మ్మానోము సత్ఫలమ !
కదనమ్ము సల్పంగ
కతమేమి కలదయ్యా !
అరివీర భీకరుడు
పరరాజ మార్తాండు
డాతండు మీ తండ్రి !
అతివీర నాయకుడు
కన్నమ్మ దళవాయి !
మన్నీలు వేవేలు
మన్నించి కొల్చుచును
తన్ను వెనుకొని యేగ
పెండ్లికేగిన రీతి
గొండ్లి సేయుచు వేగ
అని కేగె గదరయ్యా !
అతడు సాహసి గదర !

మీ తండ్రి, నెదురించు
మేటి వీరులు గలరె ?
ప్రతి వీర భీకరుని
ప్రతిఘటింపగ గల్గు
పరమ సాహస మిల నె
వరికైనను గలచటె ?
అసహాయ శూరవరు
డాత దర్శించునే
అన్యుల సహాయమ్ము ?

జన్య భూమిని నిల్చి
శత్రువుల వే బిల్చి
ఖడ్గమ్ము చే బూని
కాలరుద్రుని బోలి
కసి మసగి చెలరేగు
నసమాన సాహసుని
ధరణిలో నీ తండ్రి
తార్కొనగ గలరెవరు ?

రాకేందు బింబాస్య
నీకేల ! ఈ చీకు :
నేల యీనిన యట్లు
ప్రోలి గల వీరవరు
లని కేగి రోయమ్య

రణము క్రీడగ సల్పి
జయలక్ష్మి కేల్బట్టి
చనుదెంతు రో యయ్య

నీవు నీ సఖులతో
నిశ్చింత నిట నుండి

నగరు రక్షింపు డీ
నాయకోత్తములార !

అదియ పదివేలౌను
అత్యంత శుభమౌను !

తండ్రి భావము నిదియె
వేండ్ర గొన కోయయ్య

అంతిపురమున నున్న
అబలలను ర  ంచు
కార్యభారము పూని
శౌర్యమ్ముజూపంగ
సిద్ధపడు మోయయ్య
యుద్ధమ్ము సేయంగ
పనిలేదు నీకయ్య !
నను వినవె! ఓ తనయ !

అని పలుకు తన జనని
యైతాంబ మోమగుచు
బాలచంద్రుం డిట్లు
బదులిడియె తా మఱల

## బాలచంద్రుడు తల్లికిడిన ప్రత్యుత్తరము

వీరకాంతవు నీవు !
వీరపత్నివి నీవు !
వీరమాతృ పదమును
కోరగా దలపవో ?

పిన్న వయసున నుండి
పెద్ద భావన సేసి
వీర యోద్ధగ నన్ను
తీరిచి దిద్దిన వీర
జనని వీవమ్మ ! ఈ
దినమిట్లు దీనోక్తి
హీన భావము దోప
నీ నోట వెలువడుట
కేమి కత మోయమ్మ !

ఊర్పుతో శౌర్యమ్ము
దీర్పగా నేర్పితివి !
యుద్ధ విద్యలనె, నా
కుగ్గుగా గుడిపితివి !

అస్త్ర శస్త్రములతో
ఆటలాడించితివి !
ఆ తల్లివా ; నీవు !
ఆ వీర సతివె ; నీ
విదియేమి యన్యాయ
మిపుడిట్లు పల్కంగ
పాడియౌనే నీకు !
వేడియును, వాడియును
ఎటుపోయె, నోయమ్మ !
కటకటా దయమాలి
పిఱికి మందుల బోసి
పిఱుపీకు కల్గించి
వీరధర్మమునె, నే
డేమఱప జూచెదవు !
గోళికాయల నాడి
గోముగా నీ యొడిని
గారాము చెల్లించి
మారాము సేయంగ

పసివాడనా? చిన్న
బాలుండనా ; నేను!

సుత వ్యామోహమ్ము
సుంత నిను లోగొనియు
కర్తవ్య పథినుండి
క్షణము దూరముసేసె
నీ వెఱుంగని యట్టి
నీతియు, వీరధర్మ
మే భువిని గలవమ్మ!

ఏ భువనమందైన
యేర్చియును పేర్చియును
వీర ధర్మాటోప
విక్రమమ్మున మించి
విజయ పతాకమ్మ
విమల హాసము తోడ
నెగుర వేసెడి, హస్త
యుగళమున, నీ పదము

లంబట్టి సేవలం
జేసి యెప్పుడు నీకెరగు
ధీర సుతుడని నన్ను
వీరమాతా ఎప్పు
డెఱుగవే నీ వింత!
మోహలతఁ ద్రుంపి
మోహరమ్మున కంపి
చండతర భాను ప్ర
చండ శౌర్యము మీర,
సురలు మెచ్చగ, గరిమ
నరితండ మురుమాడి
వీరనాయక పంక్తి
ధీరముగ నిల్చేటి
యోగ్యతను గల్పించు
భాగ్యమ్ము పండఁగ
దీవించి పంపుము
దీప్తమౌ శౌర్యమ్మె
నాకు కవచము గాగ
నన్ను రక్షింపంగ"

అని, బాల చంద్రుడు
జనని కిటు బదులిడియె.

... ... ...

సంగ్రామ పరతంత్ర
సమధికోత్సాహుడౌ
తన తనయు సాహసము
ధైర్య తన్మయీ భా
వము గనియు నైతాంబ
తమిఁ బోఁ దోయలేక
వెండి వీఁటిడి యొాచు
వేఱు పాయము పన్నె

... ... ...

ఐతాంబ ఉపాయము—

తన, మేని యందమ్ము
నును కాంతి కిరణమై
దిశలెల్ల వెలిగించి
దివ్యాంగనల తీవి
కుద్దీపన మ్మొసగు
పెన్నుద్దియై వరల

మల్లియల పరువమ్ము
ఉల్లమున నిక్షిప్త
మొనరించి, యుల్లముల
కుల్లాసముం గూర్చి
చల్లగా మాట్లాడు
ప్రమద ; యా మాంచాల
బాలచంద్రుని భార్య,
తన తలపునం బార
తన తనయు నామె కడ
కంపగాఁ దలచియును,
ఏ నాడో పెండ్లియై
ఏడేండ్లు నిండుగా
గడచి పోయిన గాని
కాంత మోమెఱుగక
పరసతీ వ్యామోహ
బద్ధుడై భ్రమియించు
బాలచంద్రుని, నామె
సన్నిధికి పంపగా
సంశయించి, పదపడి,

అందాల చక్కఁయౌ
ఆ యతివ యాననము
నవలోకనము సేయ
సహజ కామాతురుడు
సౌందర్యోపాసకుం
డా బాలచంద్రుండు
ఆ భామ ప్రణయాన
మరులు గొని, యురులువది
బవరమ్ము మాటనే
బాలుండు మఱచి పో
గలఁడంచు నైతాంట
కాంక్షించి, సుతుతోడ
నిట్లనును దాఁ బలికె

## ఐతాంబ బాలచంద్రునితో

ఓ నా ప్రియ తనూజ ?
ఓ వైభవ బిడౌజ !
సంగ్రామ రవితేజ !
సౌభాగ్య రతిరాజ !
నీ ప్రతాపౌద్ధత్య
మప్రతిహతము కాదె ?
నీ శౌర్య పద్ధతియు
నీ వీరభాషలును
నెమ్మనమ్మున యందు
నెలమి గల్గించెను.
అలరిన నెమ్మనమున
ఆశీర్వదించెదను.
పోయి రావయ్య యిక
పోరు సల్పగ వేగ
వినువీథి బోరుకాని
అనయమ్మును మంగళ
కాహళులు, నీ విజయ
గాధలను ప్రకటింప

జయ జయ నినాదముల
జయకేతనము లెత్తి
సంగ్రామ వీరభట
సందోహములు గొలువ
నగరున, ప్రవేశించు
నవికాత్ము నిగ్గాంచి
నీ పత్నియును, నేను
నేపథ్యమును దీర్చి
పొంగిపోవుచు, నుదుట
మంగళ తిలక మిడెదు
భాగ్యావసరముకై
ప్రతి నిముసమును వేయి
కండ్లతో బరికింతు
మోయయ్య ! పోవయ్య !
నగజాత నీకిడును
అగణిత శుభముల, నతి

భాగ్య వైభవముల, న
ప్రతిహత జయముల, నా
కనక దుర్గాదేవి,
కాంక్షలే, తళ్కొత్త
కదన రంగమునందు
ఖడ్గమ్ము ధరియించి
ప్రతి వీరభట కంఠ
లుంఠనము సల్పంగ
కంఠీరవము మాడ్కి
నీవు విజృంభింపంగ
గరగరగ, నిన్నెపుడు
కాపాడి, జయమిడుత

... ... ...

యుద్ధమ్మునకు నేగ
సిద్ధపడుటకు ముందు
నీవు, నీ యర్ధాంగి
నిర్మలాంతఃకరణ
ధర్మమున, నీకు శుభ

కర్మఫల సిద్ధ్యర్థ
మొసగు శుభాశిషముల
నొసపరిం గైకొను, ట
త్యంత మావశ్యక మ
త్యంత శుభదమ్మౌను

*    *    *

అతిరూప గుణశీల
ఆ సాధ్వి మాంచాల
నీ ధర్మ పత్నియై
నెగడి యుండెగదయ్య
ఆ బాల నీ భార్య
యగుట, నీ భాగ్యమ్ము
బొండు మల్లియ బోలు
నిండైన హృదయమ్ము
ఇలపైన నెలకొనిన
మెఱపు తీవల గుంపు;
ఆ మెలత మెయి సొంపు!

యోగాగ్ని దరికొనని
యోగ సుస్థిర దేహ ;
సతి యామె కౌక్కింత
సాటి కాగలదేమొ :
సురుచిర ప్రభ మీరు
మరుని కేతన మామె :
సౌకుమార్యము తోడ
సౌజన్య ధనముతో
పడతు లందఱ లోన
భాగ్యవతి తానాయె :
వైకుంఠ విభవమ్ము
పడతి బలుసౌధమ్ము
ఆయింతి, మాలక్ష్మి
అభిశాప నిహతయై
తపము సేయుచు నున్న
ముగ్ధ తాపసియామె :
ఆ లేమ కడకేగి
ఆశీస్సులం బొంది,

గుణము సవరించుచును
రణము సల్పగ బొమ్మ

... ... ...

విజయ లక్ష్మి కర
స్వీకారముం జేసి
మఱలి రావోయయ్య
మంగళము నీకయ్య

* * *

## మాంచాల ఆగమనము

అంతిపురమున నున్న
అతిలోక సుందరియు
తన విభుడు ప్రియమార
తన పేరు పిలువంగ
తన్మయత్వము చెంది
తన్వంగి మాంచాల
క్షణము కాలముపాటు
తను దానె మఱచెను
జగతినే మఱచెను
మగువ యా మాంచాల !
మానవతి మాంచాల !

... ... ...

## మాంచాల బాలచంద్రుని చూచుట

డెందమ్ము దృఢపఱచి
డిందుపడి పోకుండ
స్పృహ చెంది యా బాల
స్పృహిణీయు ప్రియుజూచు
తమకమ్ము రేకెత్త
తళుకు బెళుకుగ నగుచు

కులుకు కుందన మగుచు
తడబడెడి యడుగులను
ఒడబడని యూహలను
ఒయ్యారముగ పేర్చి
సయ్యాట లాడేటి
సఖుల సందడు లార్పి
మనసులో మొలిచేటి
మధురోహల విదల్చి
చిర విరహములు రేగి
చిరు చెమ్మటలు గ్రమ్మ
వలపు బాళికి తనువు
పులకింపగా నోర్చి
కుందనపు మేని పస
నందాలు చిందించి
"బలుహొయలు పచరించు
బయకాడు, హొయకాడు
సోయగమ్ములు చిమ్మ
సొగకాడు, తనవాడు

కాకుండ, పరసతిని
కామించి, భ్రమలతో
జీవితము వితలుసే
సెనె!" యనెడు నుమ్మలిక
ములుపొంగి, యెదదలో
ములు కట్టలై, విరహ
వేదనగ పొడిచినను
వెలది వేదురు లడచి
అడుగు దమ్మల వ్రాలి
హంస లారాధింప
కిలకిల న్నగవుతో
చెలికత్తె లేతేర
చెలియ వాకిలి తీయ
చేరవచ్చెను దానె!

... ... ...

అంతిపురమున చుండి
కంతు కాహళి యూచు
అందెల్ల రవళియే
ఆనంద మురళిగా
అతను సుకుమారుని
న్నా బాల చంద్రమసు
నాహ్వాన మొనరించె

. . . . . . . . .

## మాంచాల బాలచంద్రుని గాంచుట

రతిదేవి ధరణిపై
సతి యాకృతిని జెంది
వాల్లభ్యమును బంచ
వాహ్యాళి వచ్చెనన
అందచందమ్ము లే
అతివ యాకృతి గొనగ
సౌశీల్యవతి యామె
సహజసుందరి యామె
ప్రతిసీర తొలగించి
పడతి తన పతి గాంచె

## విరహిణియైన మాంచాల వీక్షణము

లేయెడద నుదుకెత్తు
సుచిర విరహము పొంగి
చూపుచూపున నతను
తూపులై కురియంగ
ఉల్లమందలి యులుకు
వెల్లువగ నుబుకంగ
చెలి, పెదవు లదరంగ
కన్బొమలు కదలంగ
నెన్నుదురు చిట్లంగ
పులుకు పులుకున జూచె
చూపుచూపున కోప
తాపమ్ము విరియంగ

. . . . . . . . .

"ఎన్నాళ్ళ కెన్నాళ్ళ
కీ గడప ద్రొక్కంగ
సాహసించితి" వనెడు
ఊహ యొద్దారింప
ముక్కునను వ్రేలుంచి
ముదిత మోహను జూచె

చూపుచూపునను, నా
శూరవరు గుండెలద్రి

... ... ...

"తనయట్టి శీలవతి
తనయట్టి సుందరిని
భామామణిం దనను
ప్రేమరహితుడు విడిచి
ఏ మొగముతో నిచటి
కేతెంచె నిపు" డనెడి
అసహనపు భావమ్ము
నాసటి విరుపున దెలియ
కొనకంటి కెంపులే
ముసరగా వడి జూచె
చూపు చూపున నతని
పాపమ్ము తూట్లువడ

... ... ...

ఏ సౌఖ్య మెఱుగని

ముద్దరాలను నన్ను
నీ రీతి హింసించి
వైర భావము జూప
కతమేమొ ? యను తలపు
కలికి గుండెలు కెలికి
కలవరమ్మును రేప
అతితీక్ష్ణముగ జూచె
సతి యపుడు తన పతిని
చూపుచూపున భ్రుకుటి
చాపమై వంగుచును
కఠినాత్ము గుండెలో
బాణమై గాడంగ

...   ...   ...

బుస్సు బుస్సన నెగయు
రోష మావేశమ్ము
లాపగా వశపడక
గుండెలోతుల, సుడుల
గుండమై, సుడిదిరుగు

వలపు తలపుల యూపు
నోర్వ జాలగలేక
ఉస్సురుస్సు రనుచును
ఉలికులికిపడుచు నా
తరుణి, లే జవరాలు
బిరుసుదనమున గాంచె
పౌరుషమె కేడెమై
పరుసదనమును బెంప
తీయతలపుల వేడి
తీవరింపగ జూచె
పారవశ్యపు ప్రభలు
పడతి మనమున దోగి
తెలికన్నులన్ మెఱయ
శతకోటి మన్మథుని
సౌందర్య ఘననిధిని
తారుణ్య నిర్ణిద్రు
తన విభుని, నాచంద్రు

... ... ...

# బాలచంద్రుని పారవశ్యము

భామ కోపంబేమొ
లేమ తాపంబేమొ
బాల చంద్రుండింత
భావింప గల్గెనే
ప్రతిసీర తొలగంగ
బంగారు ప్రతిమయొ
కాంత దేహపుకాంతి
కనులు మిరుమిట్లుగా
జగమెల్ల వెలిగింప
జడుడగుచు నిటు తలచె
'ఊర్వశియొ, రంభయో
శచ్యి రాణియొ ! కాక
అచ్చరల వంశంపు
మచ్చెకంటియొ కాక
మానవాంగన యౌనొ !
తన సతియొ, పరసతియొ
తానెఱుగ లేదయ్యె
దివ్యమౌ ఆకృతిని
దీధితులు వెదజల్ల,

ఆ యతివ, ఆ ప్రతిమ
మాంచాలయో ధర్మ
పాంచాలికయొ, యేమొ !
ఏ మెఱుగ లేదయ్యొ
కామాతురుడు ! వాని
కొక్కమాఱుగ నిట్టి
చక్కదనముల చుక్క
కాంతిపుంజపు క్రాంతి
కాంత, కన్నులయెదుట
సాక్షాత్కరింపంగ
అక్షీణ విభవుండు
మతిపోయి, ప్రమాన్పడియె
శ్రుతి తప్పి, గతి తప్పె
నిగ్రహము గోల్పోయె
నెలత విగ్రహ యష్టి
చిక్కుపడగా, దృష్టి
మక్కువలు పెక్కులై
మరుని పాశము లౌచు

స్మర సుందరుని బాలు
గట్టిగా బంధింప
పట్టుదప్పుచు నతడు
చూపులను మఱలింప
నోపగా లేక, తా
నంతంత వీరుండు
అంబేదయై పోయె

* * *

## మాంచాల వివేకము

మానవతి మాంచాల
ప్రాణపతి ప్రణయమ్ము
బల్మి లోగొనిన ధీ
బలము పెంపున, మంచి
చెడుగులను భావించి
స్థిరత నెద భజియించి
వీరధర్మము మిగుల
సారవత్తరమౌట
మాతృదేశపు రక్ష
మాన్య మగుటయు నెంచి
తన స్వార్థ సుఖముకై
తల్లి దేశపు సేవ
బలి యొనర్చుట దొడ్డ
పాపమని మదినెంచి
మోహ పరవశత, బలు
మూఢుడై వర్తించు
తన కాంతు వింతైన
తెలుగునకు వెలుగంది

కామునకు వశులైన
కాంతుల గతి యిట్టిదె ?
మంచి చెడుగుల విలువ
కొంచెమైనను గనరు
కార్య, మ్మకార్య, మని
వార్య కార్య, మ్మవశ్య
కర్తవ్య మెఱుంగని
ధూర్తుడే యీతండు !
ఐన నేమౌ? ఇడు, ని
తని మేల్కొలిపి, యిపుడె
యని కంపుటే నాకు
ఘనమైన కర్తవ్య
మని యంచు మాంచాల
తలపోసి యిటు పలికె
తలిరాకు కెంబెదవు
లంచిత రుచులీన, వి
పంచి కాత్రుతు లీన !

*　　*　　*

## మాంచాల ఉపదేశము

నవమోహనాకార !
నాఱెంపు విలుకాడ !
సాహస స్థేమాంక !
సౌందర్య మీనాంక !
ననవిల్తు నవకము
కొనగోట నెగజిమ్ము
కొమిరెప్రాయపు సౌరు
క్రొందళుకు గలవాడ
నవ మోహనాకార !
నాఱెంపు విలుకాడ !
కండ్లు దెఱచియె నీవు
కలలు గనుచుంటివో
'సబ్బాయి' గృహమంచు
అబ్బా ! మత్తు విడవో !
'శ్యామాంగి' నే కాను
రోమాంచమును మాని
కను దెఱచి, కనవె ! నీ
వనిత ! నే ! మాంచాల !

పరిణయం బాడవే
బంధుజనములు మెచ్చ;
అగ్నిసాక్షిగ నన్ను !
నగ్నసత్యం బిదియు
మాంచాల గృహమంచు
మతి తెలిసి వచ్చితివా !
అన్యభామా విలా
సాంతః పురమ్మంచు
ఆనందమును జెంద
అరుదెంచి నాడవో !
ఏది, యెట్లైనను, గాని
ఏనాటికిని గాని
మా యింటి విందవై
మనసు పండించితివి !
బ్రదుకు బంగరుసేయు
మధురానుభూతిగా
భవదాగమన గాథ
పదునైన నాగుండె

కుదిలించి, రక్తిమలు
కుప్పలుగ బోసేను
నా బ్రదుకు వెలిగించు
నప్రమేయ జ్యోతి
యై యిపుడు, నీ రాక
నా హృదయ గేహాళిని
నిలిచి, నిత్యము గాగ
వలపులను విరజిమ్ము !
' నా మధుర భావనల
ఫలమ ? గురుదీవనల
బలమ ? నా హృదయమా ?
నా ఆనంద గీతమా !
నా, సుమానుష కాంతి ?
నా శుచిస్మిత క్రాంతి !
నా పరాక్రమ రేఖ !
నా మృదు గర్వమయూఖ
మమృత ధరాధరముగ
నాకృతిం గై సేసి

ప్రేగు దనమ్మును పెంచి
గరువదనమ్మున మించి

నా ప్రోల నిలిచెనే!
నా ప్రోలు వెలిగెనే!
నన్నేలు దొరవీవు!
నాకండ్ల సిరివీవు!
శూన్యమౌ హృదయాన
హసియించు నెలవీవు;
తీయనౌ నిదురలో
నర్తించు కలవీవు!
నీయెడల నాకుగల
ప్రణయమ్మపారమ్ము
ఐన నే మౌనయ్య
నావంక గనుమయ్య
నా పలుకు వినుమయ్య

జననిదేశపు రక్ష
సల్పగా, జనుమయ్యా
అనుచు మాంచాల పతి
నదలించి మేల్కొలిపె!

... ... ...

## బాలచంద్రుడు భావించిన మాంచాల సౌందర్యము

నలినాక్షి భద్రోక్తి
ములుకులై నాటంగ
తెలివొందె హాయకాడు
మఱల మోహము చెంది
మాంచాల నొసపరి, దృ
గంచలములం జూచె .

* * *

తీరైన ఆ కనులు
తీయ తలపుల గనులు
నిడుపైన ఆ నాస
పొడవైన నా యాశ

అదరు లేబెదవి, నా
ఉదుటు రక్తపు పృథివి
ఈ లేమ, ఈ చాన
ఈమగువ, ఈకాంత
నా యైశ్వర్య విభవ
అతులమౌ, నాదర్ప
వైభవ మీ పడతి!
అందాలు తెలియంగ
అతివ యవతరించెనో
యీ పుడమిపై నిపుడు

*　　*　　*

నిగనిగని మెఱయుచు
సొగసులను గుఱియుచు
చీకట్ల చీకొట్టు
చెలువసిగ, ఒక యెత్తు
అలివేణి సిగపైన
నిలుచుటే పెన్నిధిగ

కులికి నృత్యము సల్పు
స్మరవిభుని కేడె మన
అరవిరిసి, నగు,మొగలి
సిగపూవు, పైయెత్తు

... ... ...

జగతి గల అందాలు
నగుమోముపై నిలువ
గర్వ విస్ఫూర్తితో
కాముండు తానిడిన
వెడదపట్టము నాగ
విశదమై వెలిసేటి
చిరుదైన ఆ వెలది
నెన్నుదురె ఒకయెత్తు
అందచందములన్ని
అందఱును చదువంగ
వర్ణించి, లిఖియించు
అద్భుతాద్భుత కావ్య
రమ్యాక్షర మ్మొ్మచు,

బాలికామణి క్రమ
ఫాలమ్మునం దేర్చి
కమ్మకస్తురి దీర్చు
తిలకమే పైయెత్తు

... ... ...

ధవు గాంచి, తమి మీర
ఔరౌర యని మెచ్చి
మోమంత వ్యాపించు
కాము బాణములైన
నలినాక్షి విస్ఫార
నయనమ్ము లొకయెత్తు
ఆ విధిని వ్యాపింప
ఆలేఖ్య మౌ అతివ
అందాని కాతంక
మగునేమొ యను భీతి
హద్దుగా గిరి గీసి
ఒద్దికలు దిద్దేటి
కాంత కజ్జలరేఖ
కాంచగా పై యెత్తు

ఎలనాగ సౌందర్య
జలధిలో తలమున్క
గా మునిగి, తబ్బిబ్బు
గాకుండ రక్షింపు
మని యంచు, కామదే
వుని వేడ, కరుణించి
యా విభుడు చేతికిని
నందించు బంగారు
వంకె యన పొంకముగ
పొంగారు, ఆ పొలతి
నాసికయె ఒక యెత్తు
స్తవనీయ మౌ రూప
లావణ్య ఖనియైన
మగువ యా మాంచాల
మహనీయ సౌందర్య
సౌభాగ్య వంతమౌ
మిసిమి ప్రణయపు జలధి

మునిగిపోయిన యట్టి
వనితాభిరామునకు
కరుణ నా జవరాలు
తెలవు జూపగ పట్టు
కర దీపికన మెఱయు
తరుణి నాసిక పైని
అక్కజపు వజ్రంపు
ముక్కెరయు పై యెత్తు

... ... ...

కలకంఠి కంఠమున
కొలువున్న గీర్వాణి
వీణియను గిల్కొల్పు
వజ్ర పేటికోపరి
పద్మరాగపు లలిత
భద్ర కవాటములన
పెంపొందు బింబోష్ఠి
పెదవులే ఒక యెత్తు
అధర యుగళము దెఱువ
మధుర మంజుల రీతి

శ్రుతి రుచిరగీతికా
ఋతులగుచు, వెలుగొంది
దంతపంక్తుల కాంతి
దొంతిమల్లియ నవ్వ
హితము నుపదేశించు
మితభాషి, శుకవాణి
మురువు హరువులు గులుకు
పలుకులును పైయెత్తు

... ... ...

భూమిని నసంఖ్యాక
భామినుల సౌందర్య
స్పర్ధలో గెలుపొంది
పడతులకు నెనగాని
మెండైన కీర్తితో
గండువారింటిలో
కలికిగా, నునుకాంతి
గండరువుగా మెఱయు
మాంచాల ముఖలక్ష్మి

మంగళోపాసనా
మంత్రాక్షరమ్ములై
యంత్రగళ పీఠిపై
ఆవంక దొరకొనుచు
నీవంకకును బలియు
శ్రీంకార, హ్రీంకార
ఐంకారములు నాగ
వీనులును; చుబుకమ్ము
వీను మిగులుబె యెత్తు
ఆస్యలక్ష్మికి పట్టు
హారతుల దివ్వెలై
తోరణపు మాలలై
నూత్నరుచులను నుమియు
రత్న తాటంకములును
చుబుకవర్తుల శ్రీలు
చూడగా పైయెత్తు

...    ...    ...

అనఘ సౌభాగ్యమ్ము
నమలిన సౌందర్యమ్ము

క్రపంపు తావులై
అ్రబంపు దీవులై
కోమలి, కపోలములు
కుదురుచే ఒకయెత్తు
బాలచంద్రుని విజయ
భాగ్యాంకములు ననగ
పసమీరు మకరికా
ప్రతములు పైయెత్తు

... ... ...

ఇందు బింబము గేరు
ఇంతి ముఖలక్ష్మికిని
కళ్యాణ పీఠమౌ
కంఠమ్మొ ఒకయెత్తు
హృదయ దఘ్నము గాగ
గళసీమ పొలుపొంది
అమల భావము దెల్పు
హారములు పైయెత్తు

... ... ...

మానినీ మర్యాద
నేను తెల్పెద నిట్లు
రండు రండని పిలిచి
రమణులకు బోధింప
కకుబంతములు సాగు
కల్పలతికల యట్లు
కంకణమ్ములు మ్రోయు
కరములును నొకయెత్తు
భూజనమ్ములు మెచ్చి
భ్రాజితమ్ముగ తొడుగు
భుజకీర్తులును, అర్ధ
వంకీలు - నుంగ్రాలు
కంకణాల్పై యెత్తు

... ... ...

అసమానమగు ఠీవి
వసుధ వాసిని గాంచు

భరతరమణుల శీల
సౌభాగ్య శిఖరంపు
వైభవ ప్రతిరూప
చిద్విలాసము చిందు
చిత్కళామతల్లికి
నత్యంత భక్తితో
నారాధనము సలిపి
పరువు, బరువును మోయు
పాద పీఠికలైన
పంకజ ద్వయమనెడు
పదయుగళ మొక యెత్తు
మహినిగల మహిళలను
విహిత వాదమ్మునకు
సరి సవాలునకు పోలి
మంజురవళిని బిల్చు
మంజీర సింజాన
గుంజనము పైయెత్తు

*   *   *

భరత రమణుల తపము
ఫలియింప భువియందు
విలసిల్లు, కల్పలత
పొలతి తనువాక యెత్తు
ఆసియాడు కౌనునన్
గుసియాడు బంగారు
మెరిసేటి బహురత్న
మేఖలయు పైయెత్తు

* * *

కందర్పు దర్పమ్ము
కాంత శిల్పాకృతిగ
పుడమికే పొడవైన
తొడవుగా పొదలంగ
హొయలు పచరించుచును
ఒయ్యారములు గుల్క
ఎత్తులెన్నో యెత్తి
పై యెత్తు లూహించి

అందాల బరిణెగా
కుందనపు బొమ్మగా
మందయానను ధాత
మలచి యిమ్మహి నిల్పె
కాకున్న ఈ తీరు
ఇంతు లిల గల్గుదురె ?

... ... ...

పసపాడు నొదలి పస
ఎసలారు నుడుల పస
వసవొల్చు తలపు పస
కసిరేపు వలపు పస
పసమీరు పడతి పస
భావించి బాలుండు
భ్రాంతుడై పల్కెనిటు

## బాలచంద్రుడు

పాటవెలది : వనజనయన వలపు బాళి యగ్గల మౌచు
నన్ను నేచుచుండె, నాయునిక్క, నామనిక్క
నీదు కరుణపైన నిలుచును, నీదాసు,
నిప్పుడేలు కొనవె ! ఇంతి జాలమదేల ?

## మాం చాల

తేటగీతి॥ అనుచు విభుడిటు పల్కంగ నతివ యపుడు
ప్రేటువడిన నాగాంగ నార్భాటమంది
మిగుల రుషజెంది కన్గవమీది కెగయ
భ్రుకుటి ముడివడ పల్కె నీరీతి కనలి

... ... ...

స్నేహశీలము రుచిరమైనది
ప్రేమభావన విమలమైనది
మమతయైనను మంచి కగుచో
మధురమైనది మాన్యమైనది
సృష్టి యందున విలువనొందని
విషయముండునె ! వివరమిదిగను
మమరమైనది, అమలమైనది ;
ధర్మమఱయగ ! ధర్మమహితము
కాని స్నేహము, ధర్మయుక్తము
కాని ప్రేమము, ధరణియందున
ధన్యమగునే ! మాన్యమగునే
దేశమాతను, రక్ష సేసెడి
సమయమిప్పుడు సమీపింపగ

మాతృసేవకు మమత చూపక
అధికమోహము నంది, వీరుడ,
ఆ, ఆపద మఱచి, యిపుడు వనితల
బాహుబంధము నాస సేయుట
ధర్మమగునే! నీదు బ్రతుకిక
ధన్యమగునే : తలపవేమిది ?

... ... ...

యేమియైనను, నిప్పుడిట్టుల
వాదులాడుట, భావ్యమగునే
ఆత్మధర్మము, నతిథిధర్మము
ఆప్తధర్మము, మఱచి నే నిటు
లెన్నినోముల ఫలమొ యౌ,నీ
విటు, మాయింటి విందవౌచును
రణకార్యార్థ మరుగుదెంచియు
అంగణమ్మున నడుగువెట్టుచు
నిలిచియుండగ, విలువసేయక
వాదులాడుట, భావ్యమగునే ?

స్వామి ! నావలన నెంతో యప
చార మయ్యెను. క్షమియింపదగు;
నన్ను ! భవదీయ దాసినిగద !
దోసమెన్నకు దోసిలొగ్గెద
మృదులమౌ, అరవింద సుమముల
నపహసించెడు నడుగుదమ్ముల
నా యెదలపై నిడుచు చల్లగ
మెలమెల్లగా నడచి రాగదె !
మదనసుందర ! మన్మనోహర !
కదనకుశలుడ ! కాంతుడా యిటు
లర్ఘ్య పాద్యము లాదరింపుము
ఎడద పొంగిన, కడలి వారిని
అడుగు దమ్ముల కడుగనీయవె !
అదుపు దప్పుచు సొదల దూలుచు
మనసుమాటున పెనగులాడెడి
దీప్త ప్రేమను పదములంబడి
తృప్తి తీరగ తుడువనీయవె !

... ... ...

అనుచు నాసతి చెలుల బిలుచుచు
మగని సేవల మనసు దగులగ
రాచరిక మర్యాద లెన్నియొ
ప్రాణవిభునకు పడతి తీర్చెను
బ్రదుకుసారము, ప్రణయభారము
తురగలింపగ దోయిలించెను

... ... ...

## బాలచంద్రుని భావన

ఆ బాల అందమ్ము భావించి
ముగ్ధుడై, మత్తుడై, బాలుండు
నోట మాటయె లేక పరవశత
చెందియును, కొంతవడి, స్పృహచెంది
సుందరియె కాదు నా మాంచాల
అందఱను అన్నింట మించేటి
అసమానధర్మ సుందరశీల
ఆనందమాల! నా మాంచాల!
అనుచు దా నెఱిగి ఆ చంద్రుండు
మాంచాల వెనువెంట మందిరము

చొచ్చె, నెడియొ యొక వింతభావము
మదిలోన నూల్కొనుచు తొల్కాడ

... ... ...

## సాయం సమయ వర్ణన

ఇంతలో రవి పశ్చిమాంబుధిని గ్రుంకులిడ
మదను సామ్రాజ్య మేలెడి, అదను
లభింప, నిశీథినీ కాంత దఱిజేరగా
చంద్రుడాక్రమించె వేవేగ నభ్రోవీథి॥

తే. గీ. సాంధ్య రక్తమల్ దిశలను సందు కొనియె
ప్రాగ్దిశాసతీ ముఖమున పరిఢవిల్లు
ఫాలమణి యొచు తారకాప్రభుడు, బాల
చంద్రుడు గగనపథమున సాగివచ్చె.

మందిరాభ్యంతరమునుం జేరి మాంచాల
పట్టుపరుపులు గల్గు, పట్టెమంచము జూపి
"విశ్రమింపుడు, రవంత తడవిందు, నాస్వామి!
వీవనల్ బట్టెద నొక్కింత సేదదేర?"
అని పల్కి మాంచాల మగని సేవల జేసె
ఆ భామ పచరించు పరిచర్యలం దేరి
బాలుండు ప్రణయ సంభావితుం డౌచు
మాంచాల పయ్యెదన్ బట్టె మత్తు డగుచు

... ... ...

... ... ...

## మాంచాల పౌరుషోద్దీప్తి

తే॥గీ॥ కొంగు విడువుము ధూర్తుడా! కొంగు విడుము
అంగనల జేరి, సంగ్రామ భంగి మఱచి
మదనపూజల దేర్చెడి అద నిదియని
చౌరవ మాంచాల సదనమ్ము చొరబడితివా
కొంగు విడువుడు ధూర్తుడా! కొంగు విడుము

తేటగీతి॥ తల్లి యైతాంబ కడ శౌర్య ముల్లసిలగ
సల్పినట్టి యా వీరప్రసంగ మంత
యెందుబోయెను ! నీశౌర్య మేందుబోయె ?
పడతిఁ జేరు నుపాయమా ? పల్కులల్లి !

*　　　　*　　　　*

## * నవచామరము *

అవక్ర వీర విక్రముండవై, అనన్య జన్య నాయకుండవై
పవిత్ర భారతీయ పుత్రకుండవై, పరాక్రమోజ్జ్వలుండవై
భవాంబురాశి దాటు యోచనన్ బలమ్ముగా దలంపవేమిరా !
అవాంఛనీయ మోహవల్లి ద్రెంచిరా ! ఆహవమ్ము కేగరా
దోరా !

1\. తేటగీతి॥ బిరుదుగల మగ లెల్ల మున్ వీర్య శౌర్య
పద్ధతిని నుద్ధతిని జూపి యిద్ధరీతి
మాతృదేశ రక్షను సల్పి మాన్యులైరి
ఇట్లు మోహపరవశులై ఇంగితమ్ము
విడచిరె ? బ్రదుకుటన్న ప్రవిమల భావ
దీప్తి పెంచుచు బ్రదుకుట తెలియ వలయు
బ్రదుకు బ్రదుకుట భాగ్యమ్ము అదియ కాదొ
తల్లి కడుపుచేటు బ్రదుకులెల్ల వితలె !
అనెడు మాంచాల పల్కుల వినియు నతడు

## బాలచంద్రుడు

పాటవెలది॥ ఎదురుపల్కి నన్ను బెదిరించె దేలనే
బదులు పల్కివేగ బాహులం దేల్పవే

## మాంచాల

ఎదురు పల్కినంత బెదరుట యేలయ్య?
ఎదురులేక శత్రు నెదరంగ బోవయ్య!

తేటగీతి॥ ఎంతొ యుద్రేకమున గుండెలెగయుచుండ
పటుతర సుకోపమున ముకుపుటము లదుర
ఇస్సి! దుష్కాలమిట్లు ప్రాప్తించె నంచు
బాలు కరమును విదలించి పారవైచి
ఇంతి, మాంచాల వెండియు నిటు వచించె

... ... ...

"హతవిధీ, ఏమాయె! నాస్వామికిపుడిట్లు
వీరధర్మము నెంత చెప్పిన, సుంత వినడు
నేను మాత్రము బావుకొనిన దేమి కలదిటు!
ఈ వివాహము రస ప్రవాహమ్మొ ననెడి
గురుల యాశిషమ్ములు నట్టేట కలిసెగద

... ... ...

తెరగట్టి, గళమునన్ తాళి గట్టినవేళ

సౌందర్య ఖనియైన నీ రూపు మదిలోన
భాసించి, తనువు పులకింప తనివి చెందితి
శౌర్యధనుడౌ, విభుడు లభియింప నుప్పొంగి
పోయితిని, అపుడు భావింపగా నైతి : నే,
'తాళిగా దిది గట్టి ఉరిత్రాడు పొమ్మనుచు'

*    *    *

నీ వ్రేలి కొనగోరు బట్టుచును వేవేగ
స్వర్గ సోపానముల నధిరోహణము సేతు
ననుచు భావించి తినిగద నాడు ఓ స్వామి!
నందనోద్యానమున విహరించు వేళలో
మందారములు ద్రుంచి నా అందముం జుట్టి
అవల పారవైతువనాశించి తోయయ్య!
ఏమి, అనుభవించితి : బ్రదుకు భారము దప్ప
జీవనము వితయాయె : భావనము వెతకాయె :

•••    •••    •••

పులివోలె గాండ్రుమని వలపు బొబ్బరింపగ
నీ యుపగూహనమున రక్షణము కోరుచును

తపియించి, తపియించి, పలవించి, పలవించి
విలపించి, విలపించి, వేదనల వ్రేగితిని
బాళితో తూలితిని, భారమై సోలితిని
వలపు శోధనల బారి వశమై క్రాగితిని
విరహ వార్ధిని మున్గి దురపిల్లు వేళలో
బలియుడవు నీవయ్యు కైదండ నీవైతి
మదను కైదువుల కెదురై గుండె తూట్లువడ
అదయుడా, అదలించి, అనాదరము సల్పితి
కోర్కులే చెలరేగి కొదమ సింగము లౌచు
వాడి కొనగోళ్లతో నెద చీల్చి చెండాడ
కూర్కులే యెఱుంగక రేబవలు పోరాడి
సొమ్మసిలి పోయితిర, బ్రతుకు వృథ సేసితిర
సోయగమ్ముల ఉచ్చు సొగసుగా పై విసరి
సోద్యమ్ము చూచుచును శోధించి తౌరౌర!
వలపు వేడికిని నా నిలువెల్ల దహియింప
తలచి నీ నామమ్ము తపము సల్పితిగాదె!

... ... ...

నీ శౌర్య సంకీర్తనముతో మురియు నవోఢను నేను
బాధముగ బాములం బెట్టు మూఢుడవు నీవు
విధితోడ నేనాడు జూదమున పాచికవు
తీరుటే యెఱుంగని నాగట్టి కోరికవు
ప్రణయ జలధిపై పడగెత్తు అలవీవు!
చలమింక మానుమని వేడంగ హసియించు నెలవీవు!

. . .   . . .   . . .

పూల పొదరిండ్లలో, నీ తీపి పెదవికై
గాలితో చెర్లాట మాడితిని, పృథివిపై
అసమాన సౌందర్య మదియు నా మదిలోన బారంగ
కసిమసగి నీపైన కన్నెఱ్ఱ చేసితిర
కుదురైన నా గుండె చెదరిపోయిన వేళ
నీ కుదురు వెదకుచును వేసరితినే చాల
ఆనాడు ఈ తీవ్ర ప్రణయమ్ము లేమాయె?
ఆనాడు ఈ తీవ్ర ప్రణయమ్ము లేమాయె?

ఆమనిని కోయిలలు వేమారు కూయంగ
స్వామి ! నాదరి జేరవే యంచు, నన్నింక
దరిజేర్చి, ఓదార్చి, లాలింపవే యనుచు
జంటబాసిన పులుగునై కూయిడితి నప్పు
డేమాయె ? నీ ప్రేమ ! ఏమాయె ? నీ ప్రేమ !
కటకటా, నా వెతలు, నా కతలు, నా బ్రతుకు
అపహాస్యములుగాగ, అందఱును నవ్వంగ
ఎక్కడుంటివి నాడు ? నీ వెందు దాగితివి !
అక్కజముగ నేడిటు వేంచేసితే ! యంచు
ముక్కుపై వ్రేలుంచి ముగుద యా మాంచాల
మగని కరమును ద్రోసె, కస్సుమని బుసగొట్టె

... ... ...

ఇంతలో నంతిపురముననుండి రేఖాంబ
"ఓ తనయ ! మాంచాల ! ఇటు రమ్మ"నుచు పిలిచె
తల్లి పిలుపంది మాంచాల తెప్పరిల్లుచు
గోక్షీర మానంగ వేళాయె కోమలుడ !
గోక్షీరముం గొనుచు వచ్చెదను వేవేగ

తే. గీ॥ మగని సన్నిధి బాయంగ మగువ యెంచి
తగు నుపాయమ్ము వెదకెడు తరుణమందు
తల్లి పిలువంద లోన, సంతసము జెంది
అంత నా యెడ నిలువకే అతివ వెడలె

* * *

సీసము॥ పారాణి పదముల జీరాడు కుచ్చెళ్ల
మెత్తని కరముల, మెలపి, మెలపి
నృత్య రీతుల నేర్వ, నిత్యమ్ము వెంటాడు
అంచల నందంద యాపి, యాపి
మంజీర మాణిక్య గుంజానముల తోడ
సరిగమ మధురిమల్ విరివి, విరిసి,
సౌశీల్య భాగ్యమై కైసేసి పుడమిని
సుర పుష్ప పరిమళాల్ గురిసి, కురిసి
ఇంతి చనినట్టి త్రోవ రక్తిమలు సెలగ
అందములు ప్రోవులై త్రోవ నచ్చుపడగ
కమ్మనౌ రాగ వాసనల్ గ్రమ్మకొనగ
రమణి మాంచాల అంతిపురమున కేగె

... ... ...

వింతయో యిది సిలుగుల క్రంతయొ
వెలుగుల పుంతయొ మఱి ఆవంత
యెఱుగడా బాలుండు జవరాలి

సౌందర్యజలధి మునుగుటె తప్ప
ఏ మెఱుగ దయ్యెనె యెంత వింత
ఇంత సుందరి నింత కాలము
        నెట్లు లేమఱి యుంటినో
ఇంతియో మరు బంతియో ఇది
        ఇంతి జేరక నిల్తునే
వంత దీరుట, సంతసించుట
        వలపు పండుట కల్గదో
సుంతయే దయ జూడదాయెను
        సుదతి నెట్లు తెమల్తునో॥

అనుచు బాలుడు బాళి చెందుచు
ఆర్తుడై బెగడొంది కీర్త్యాది
ధూర్తుడౌ విధి దుర్ణయమ్మిది
యంచు దూరుచు నటమటించుచు
కొంత సమయము చింతతోడను
కొంత సమయము విరహమ్ముతో
కాంత యోగమనమ్ము కోరుచు,
కాంత యేగిన త్రోవ గాంచుచు,

వనితవల్కుల పనవికొనుచును
వనిత వాసిని తలచుకొనుచును
భామ యందము ప్రస్తుతించును
భామ శౌర్యము, భామ దర్పము
వెలది సాహస విభవ మెన్నుచు
తలపు లుక్కిరి బిక్కిరి చెంద
ఉద్ధతమ్మగు ఉవిద పద్ధతి
భావమందున పారినంతన
మనసు బ్రాన్పదమందుడౌచును
వేవితమ్ముల వెలది తలపులె
వేడబమ్మును పెంచుచుండగ
వెట్టి యౌచును, వెండియును, క
ర్తవ్య మెఱుగక, రమణి సోయగ
మెన్నుచు, నహహ యనుచు మెచ్చును
విరహ విభ్రమ తీవ్ర తాడిత
కాయుడై స్మర పీడితుండై
వలపు తెమ్మెర వాడి చూపగ
మనసు దిమ్మగ, సొమ్మసిల్లగ

ఱిచ్చవడుచును, పిచ్చియౌచును
నిదుర భామిని ఎదుట నిలిచియు
అమతింపగ, ఆమె కౌగిలి
కాసవడుచును, కాంతు డంతట
గాఢనిద్రకు వశుం డాయెను

... ... ...

అదిగాంచి మాంచాల
అంతిపురమున నుండి
వెల్వడియు, విభుజేరి
పల్వరుస విప్పకయ
హ్హా యని నవ్వె
అబబ్బ యని బ్రువ్వె
ఉస్సురని నిట్టూర్చె
ఉద్ధతిని పోకార్చె.

... ... ...

విభుడు నిద్రకు వశుండగుటను
గాంచి యాచెలి, గతము నందలి
గాథలన్నియు బాధవెట్టగ
కొట్టువచ్చియు గాల్చి నట్టుల
మనసు సురియగ పనవికొంచును
విరహవేదన తీవ్రమై నిలు
పోపనీయక పోడు జేయగ
పూవుబోడియు ఉస్సురంచును
వేదురడపగ వెలది వెన్నెల
నాశ్రయించెను- అతివఆశను-

*　　*　　*

## మాంచాల విరహవేదన

వెన్నెలా ! ఓ వెన్నెలా - పలుకవేమే
కులుకులాడివి గదె

తెల్లవలువల దాల్చియుంటివి
జాజిపూవుల దురిమి యుంటివి
ము త్తెసరులను మోజు దీరగ
అరుత దాల్చితి మురిపె మొలుకగ
ఎచటికేగ దలంచి తేమొకొ !
ఎన్ని యుగముల మైత్రి కలదో
నీకు, నాకును ! నిన్ను నిల్పియు
నెన్ని కతలను, ఎన్ని వెతలను
ఎంత బాధను ఎంత వేదన
నేడ్పు పాటల. కేలు మోడ్పుల
నెదలు విరియగ, సొదలు పొంగగ
నీదు ఒడిలో శిరసు నుంచియు
ఖిన్నతను వినిపించి యుంటినా !
ఇంతలోపల మఱచి నీవిటు
ఒంటిగా నను విడిచి యెటకో
ఏగగా దలపెట్టు కల్గెను ?

వెన్నెలా ఓ వెలది వెన్నెల!
వెన్నలో మఱి యెవ్వరో ఇటు
ముండ్లు పిసికిరి గాదె తెలియవె!
పిడికిలంతటి చిన్న గుండెను
కడలి యంతటి కాంక్ష దాచితి
కడకు మిగిలిన ఘనత యేమే?
తుదకు దక్కిన ఫల మిదేనే?
ఇన్నినాళ్లకు, నన్ను మెచ్చుచు
విభుడు కోరగ, వీరధర్మము
దేశభక్తియు తీవరింవగ
నిర్దయతను, తిరస్కరించితి
మనసు మమతల వేడి గ్రాగుచు,
కుతకుతయుడుక, విరహ వహ్నిని
తనువు నిలువున దహనమై, తుది
బూదియై యిల కుప్ప గూలగ
కడకు దక్కెడు ఫల మదేమే?
వెన్నెలా, ఓ చెలియ వెన్నెల!
పలుకవే, నను పలుకరింపవె!

విభుని గూడుటో, ప్రేమ పీడుటో :
కాంక్షతీర్చుటో - కాంతునెనికిని
పంపుటో, ఏది కర్తవ్యము
తెల్పి నన్నిక తెమల్పవేమె ?

... ... ...

వెన్నెలా
ధవుని చిఱునగవు కనుపాపలో
చిత్రముగ నిలిచి చిలిపిగ వెక్కిరించెనే

వెన్నెలా
విభుని నును పెదవి విడి దొరలు తెలి
ముత్యంపు సరులు నా గుండెపై
హారమ్ము లౌచును మెఱసెనే

వెన్నెలా,
నా గుండె కఠిన పాషాణమై
నా నాథు ప్రణయ భావోన్మేష

కెడమీక రోసమున చూచినన్
ఆ చూపు నాతండు కల్హార
మాలగా అందుకొని మురిసెనే

వెన్నెలా, ఓ చెలియ వెన్నెలా
ఏమి చేసితి, నేనేమి చేసితి చెప్పవె?
తెలిమంచు సోనగా, మంచుమల
విరిసేటి ఆహ్లాదకరమైన
నీరెండగా దోర వయస్సిది!
పరువాల వెదజల్లు తెలిపూల
జల్లుగా, నామేన పర్వెత్తు
ఈ సొగసు, ఈ వయసు, ఈ వలపు
వితలు సేసితిగాదె! ఇది తగునె?
ఇంకేమి సల్పగా, ఈ వయసు
ఈ వలపు వశపడునో చెప్పవే
చెప్పవే, చెప్పవే! వెన్నెలా!

వెన్నెలా
నా జీవసర్వస్వ మాతండె
ఈ మధుర జీవితపు పరమార్థ

మాతండు కాదొకో నా స్వామి
నా పిలుపు నందుకొని శతకోటి
స్వరాలపై నుండి, హాయిగా
ఆనంద ప్రజ్వాలితుం కుండగుచు
భువికి దిగిరాగలడె ? వాడు, నా,
నా వలపు టెకిమీడు ? నా సన్ని
ధిని వెదికి కొనుచుమడి, రాగలడె ?

వెన్నెలా —
ప్రణయ మాధురీ జ్వలితమ్మౌచు
వెలుగొందు. ఈ విభావరియందు
ఈ రేయి ఈ ప్రకృతి సర్వమ్ము
హాయిగా తియ్యగా, ఆనంద
తన్మయత్వమున దాన మాడెను ?
ఒంటిగా, వ్రేగి పోవుచునుంటి !
వెన్నెలా, ఓవెలది, వెన్నెలా -
వేయి యుగముల రేయింబవళ్లు
విభుని మృదు పాదతలము సోకి
పులకించి పోయెటి: నునులేత

పచ్చికగ, నా బ్రదుకు పరవశింపగ
నోచనైతి నెంత నిర్భాగ్యనా

... ... ...

ప్రణయార్ద్రమౌ మనసు
భావాగ్ని గుండమౌ ఈ గుండె
కన్నీట దోగేటి కందోయి
ధవుని ఆరాధనన్ సంతతము
వేగిపోయిన బ్రదుకు
కర్పూర హారతిగ
ఆయువంతా వెలిగి
ఆరిపోయేనేమొ
గుండెలో పరవళ్లు త్రొక్కుచున్
మండింప జేసేటి మృదుసౌఖ్య
భావనల్, పండుగే యెఱుంగక
దండుగై పోయేనా! యేమౌనా

... ... ...

ఓ ప్రభూ రావోయి రావోయి
ఒక్క మారిటువచ్చి ఈ ఘోర
నిరాశాత ప్తహ్నద యగుహలో
రాగ రంజిత ప్రణయ దీపమ్ము
వెలిగించి బ్రదుకు చీకటిలోన
కాంతులను నిండింప వేమోయి !

... ... ...

రావోయి. చెలువుడా, రావోయి
ఒక్కసారిటు వచ్చి. ఈ శిథిల
విపంచిని మ్రోయించి జీవతం
త్రుల మాటి నాబ్రదుకులో రాగ
మధురిమల్, విరియించవేమోయి !

... ... ...

రావేల, మధురసఖా ఒకపరి రావేల !
ఒక్క సారిటువచ్చి నీ చెలికి
కైదండనే యిడుచు నీ ప్రేమ
ఈ గుండెశిలపైన శాసనము
గా చెక్కి, నిలిపి పోగదవోయి !

రావోయి ఓ ప్రభూ రావోయి !
ప్రేమవిజయము కంటె బ్రదుకులో
నిలువయౌ విజయమ్ము లేదంచు
నను నిలువరించియును, నీ ప్రేమ
విలువలన్ తెలియనీయగ రాదో !
బాలాతప స్పర్శకున్ విఱిసి
పోయేటి హిమబిందు జాలముం
బోలె, ఈ వంతలన్ నీ ప్రేమ
సన్నిధిని కడిగిపో నీరాదో !

... ... ...

బ్రదుకు బండలు చేయు ఈ త్యాగ
వ్రతముచే, జీవ సర్వస్వమ్ము
హరియించి పోవుటే. తప్ప ఈ
బ్రదుకు నిండబోదని తెలిసియున్
తెలిసియు నేనేల, తన్నుమాలిన

ఈ వీర ధర్మమున్ వరియించి
ఈ బాములన్ బడుచునుంటినో !
చెప్పవే, వెన్నెలా - చెప్పవే !

... ... ...

మంచి హితమును చెప్పి, నా మనసు
మఱలించి, విధురమ్ము కాకుండ
మధురమ్ముగా బ్రదుకు మలచవే
వెన్నెలా. జన్మ జన్మమ్ములన్
నేనెంతో పూటపడియుందునే !
ఆనంద మనుభవింపగ లేక
అగ్నిగుండముగాగ రగిలేటి
ఈ ఆడుబ్రతుకును గాంచుచున్
హసియించుచుంటినే వెన్నెలా!

... ... ...

అంతస్సు ఆశల అక్షయతూణీరమ్మై
ఆంతర్యపు లోతుల గాడగా
పాపమా పసిబాల, మాంచాల
తాపమాపగ లేక తారుణ్యవతియైన
స్వర్ణప్రతిమ బోలి, వలపుసెగ
కడు కఱగి కఱగుచు, వరాకియై
దురపిల్లె సుచిర విరహిణి యౌట

కడకు కర్తవ్యముం దెలిసికొని
కనుల వెంబడిజారు కన్నీటి
కొనగోట నెగజిమ్మి, స్వస్థపడి
కురులు ముడిచియు మబ్బు వీడంగ
వికసించు నిండు జాబిలి బోలె
మగని ననికంపు కర్తవ్యమ్ము
తిరముగా మదిదోప, తెలివొంది
నగుచు దానిట్లు దలచెను మదిని

## మాంచాల తెలివినొంది మగని వనికంపుటకు నిశ్చయించుట

"మేలుకొనియే యుంటినో నేను
కలగనుచు, కలువరించుచుంటినో!
నా యింట, నేనాడు లేనట్టి
పిఱికిదన మెట్లు లోగొనియె న
న్నేమైన గానిమ్ము క్షణమాత్ర
మది నన్ను కలతపెట్టెనె గాని
కర్తవ్య మేమార్చగా లేదు.

తెలివొంది, తెప్పరిలితిని గాదె!
చెల్లరే! ఎంతో పొఱపాటయ్యె
ఇపుడైన నేమాయె! పొఱపాటు
దిద్దుకొన జాలితిని, శుభమయ్యె

తేటగీతి. భార్య గర్భిణియైనను భ్రమలు వీడి
సాహసమ్మున నభిమన్యుడాహవమ్ము
సలుప దానేగ లేదె, ఆ సరణి దెల్పి
ప్రభుని, రణమున కంపెద ప్రజలు మెచ్చ!"

... ... ...

తూర్పు తొయ్యలి వేగ ము స్తీబు సవరించి
బాలభానుని, రక్తారుణిమల్ చెలరేగ
ముసుగులో నుండితా ముందుకుం, ద్రోసి, తా,
విశ్వమున్నింతలో చైతన్యమొనరించు
కర్తవ్యముందీర్ప వేగిరించుచునుండె
వెలుగు లోకాల వాకిళ్ళు నివృతములయ్యె

... ... ...

"నాస్వామి మేల్కొల్పి జాగృతిన్ కల్పించి,
యాలమ్ము సేయంగ నాయత్తపడుతు,నే"
నని యంచు మాంచాల దిగ్గురని లేచియున్
దిననాథు మొగమగుచు, దీప్తభావమ్ముతో
అంజలిన్ ఘటియించి ఆత్మేశు కడకేగె!

... ... ...

# సూర్యోదయము

భళ్లుమంచు తెల్లవారె
దిక్కులెల్ల తెల్వినొందె
పువ్వులన్ని నవ్వుచుండె
పక్కిగుంపు ఱెక్కలార్చి
తిండివెదుక దిశలకేగె
జియరుసామి చింతదీర్ప
వీణమీటి పాటపాడె
జగజ్జనులు ప్రగతికోరి
పాటుపడగ పయనమైరి -

రాత్రికాంత ఆవులించి
చిటికె వైచి నిదురచెందె
బాలచంద్రు డావులించి
మేలుకాంచి చిటికెవైచె
దిగ్గురంచు పాన్పుడిగ్గి
ఉస్సురంచు ఊర్పుదీసె
మగువతోడ మాటలాడ

జంకుదోప వెన్కదీసె
బాలుడపుడు మేలుకాంచ
బాల వింత తెల్విచెంది

నడుముచుట్టి మెఱయుచుండు
కత్తినంత నూడబెఱికి

చేతద్రిప్పుచు ఝుళిపించి
ధవుని చుట్టు తానుతిరిగి

మగనిచేత, మగువ, ఖడ్గ
మిడుచు, మిగుల తేజమలర
"మాతృదేవి పిలుపు వినుము
పోయిరమ్ము వీరధనుడ !
అనుచు, బాల, మగని నుదుట
రక్తతిలక మిడియె, హార
తిచ్చె , పదములంటి, కనుల
కద్దుకొనియె ! కాంతభక్తి !



సంతసమ్మున నుప్పొంగెడి
మనసుతోడ, "మంగళమ్ము
నీకు ! మాననీయ ! కీర్తి
కాంతతోడ మఱలి రమ్ము
నీ" వటంచు.

కాంతు ననికి
నంపె ! దాను, నుత్తమాశ్వ
మెక్కి రణము సల్ప జనియె



12).

... ... ...

నక్కల ఊళలు వినపడె
చుక్కలు భువిపై తెగిపడె

దిక్కుల వెలుతురు తరిగెను
పెక్కులు గూబలు అఱచెను.

మిక్కిలి రోదన వినబడె
అక్కట ! భాగ్యము కొఱవడె !

... ... ...

## మాంచాల సహగమనము

సతియయ్యె మాంచాల
వీరసతి యయ్యెనే
నా తెలుగు మాంచాల !
నీతియుత ! పతిశీల !
నవరాగ మణిమాల !
స్తవనీయ గుణలోల
సతియయ్యె మాంచాల
వీరసతి యయ్యెనే
నా తెలుగు మాంచాల
నాణెంపు పతిశీల
మందార సుమమాల
మామగువ మాంచాల
సతియయ్యె మాంచాల
వీరసతి యయ్యెనే

వీరవరుడౌ విభుని
శూరవరుడౌ మగని
గౌరవము పొదలంగ
భక్తిరక్తులు పొంగ
శిరము తొడపై జేర్చి
బూదియై పోయెనే
ముగుద మాంచాల సతి
బూదియై పోయెనే
వీర ధర్మమేకాని
ప్రేమ ధర్మమెఱుగని
ముగ్ధ తాపసి యామె
స్నిగ్ధ హృదయమ్ముతో
మాతృభూమిపై గల
మక్కువల పెంపునన్
తనకు దానే తెలిసి
త్యాగమ్ము సల్పెనే
భర్త ప్రేమనుకూడ
బలిదాన మొనరించి

... ... ...

బలిపశువుగా దాను
అసువులన్ విడనాడి
మంటలన్ మసియాయె

... ... ...

మాంచాల దేహమ్ము
మంటలోపల పొగిలి
కుమిలి బూడిద యాయె
మాంచాల ఘనకీర్తి
మంటతో తా గలిసి
మింటి కెగసెను గాదె
మంటికిని మింటికిని
మణిదీపమై వెలిగె
అవనిలో మగనాంధ్ర
ధ్రువతారగా మిగిలె
ఆ పుణ్యసతి బూది
ఈ భువిని వెలదులకు
వెలుగుల ప్రోది యయ్యె
తెలుగు జాతికి మించు
వెలలేని తులలేని
కీర్తికిని పాదయ్యె

... ... ...

సతియయ్యె మాంచాల
వీరసతి యయ్యెనే
నా తెలుగు మాంచాల
నాణెంపు పతిశీల
నవరాగ మణిమాల
స్తవనీయ గుణలోల

సతియయ్యె మాంచాల
వీరసతి యయ్యెనే

కాలము కదలుచు పోవును
కాని మనష్యులు, ప్రవృత్తి,
శీలము, భావము, ధర్మము
కాలము నందున నెన్నడు
కదలక నిలిచియె పోవును.

... ... ...

ఎన్నడు వర్తిలెనో, అల
పల్నాడున, నీ వీర చ
రిత్రము : ఐన, విశాల ధ
రిత్రిని మున్నెవరు ప్రద
ర్శింపని త్యాగము, సాహస
రీతి నొనర్చి, సుధీరత
మాంచాల కాలభిత్తిని
మగువల మాన్యచరిత్రను
నిల్పె, ననల్పముగా నిల
మగువకు మాంచాలకు, ఆ
తెగువరితనమునకు జోత
లిడుచును, చరిత్ర రచించి
ఇల నే ధన్యత నొందితి :
ఇది, తెలుగుల జాతిచరిత
కింపగు ప్రస్తుతియందును.

## ఫలశ్రుతి

మాకందము॥ ఈ కృతి చదివిన విన్న శు
భాకృతి వెలయుచు ధైర్య
స్వీకృతిని సల్పి మగువలు విజ్ఞతతోడన్
ప్రాకృత మతి వీడి హితము బడసెదరిలలో.

ఓం తత్సత్
సర్వే జనాస్సుఖినో భవంతు.

# ముఖ్యమైన సవరణలు

| పుట. | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 10 | 4 | రంచు | రక్షించు |
| 15 | 16 | పెన్మద్ధి | పెన్నుద్ధి |
| 16 | 9 | తస | తన |
| 17 | 5 | పాసకుం | పాసకు |
| 17 | 8 | ఉరులువది | ఉరులువడి |
| 18 | 10 | గల్గించెను | గల్గించేను |
| 19 | 6 | నవికాక్షు | నలినాక్షు |
| 34 | 6 | పతిమయొ | ప్రతిమయొ |
| 36 | 16 | లీన | లీని |
| 38 | 6 | మ్మవశ్య | మవశ్య |
| 39 | 5 | నవకము | నవకమ్ము |
| 40 | 11 | ఎట్లైననుగాని | ఎట్లొగాక |
| 41 | 16 | నామ్మృదు | నాదు |
| 42 | 1 | దనమ్మును | దనమును |
| 42 | 2 | దనమ్మున | దనమున |
| 44 | 6 | అతులమొ | మతులమొ |
| 45 | 11 | చిరుదైన | బిరుదైన |
| 48 | 4 | పటు | పట్టు |
| 48 | 5 | దీపికన | దీపికై |
| 49 | 11 | స్పర్ధలో | వివాదలో |
| 56 | 4 | సీరీతి | నా సకీయ |

| పుట. | పంక్తి | తప్పు | సవరణ |
|---|---|---|---|
| 57 | 3 | ఆ ఆపద | ఆపద |
| 60 | 6 | న్రభోవీథి | నభోవీథి |
| 61 | 7 | డౌచు. | డౌచు, వే |
| 61 | 8 | బట్టె | బట్టెను |
| 62 | 5 | విడువుడు | విడువుము |
| 63 | 3 | మేందు | మెందు |
| 63 | | నవచామరము | (ఇది మకుటము కాదు. ఆ రచన పేరు) |
| 63 | 8 | ద్రెంచరా | ద్రెంచి |
| 63 | 9 | దోరా | దొరా |
| 65 | 10 | నోధ్యానము | నోద్యానము |
| 65 | 11 | ద్రుంప | ద్రుంచి |
| 66 | 7 | వశమై | వశమౌచు |
| 67 | 2 | మూఢుడవు నీవు | మూఢుడవీవు |
| 67 | 5 | ప్రణయ | నా ప్రణయ |
| 69 | 10 | విరిని | విరిసి |
| 69 | 18 | పుంతయొ | పుంతయో |
| 71 | 3 | తించును | తించుచు |
| 72 | 2 | అమతింప | ఆమతింపగ |
| 72 | 11 | అబబ్బ | అబ్బబ్బ |
| 76 | 9 | లౌచును | లేయౌచు |
| 77 | 4 | వెణ్ణిలా | వెన్నెలా |
| 78 | 3 | స్వరాల | స్వర్గాల |
| 78 | 4 | కుండగుచు | డగుచు |
| 78 | 15 | బవట్టు | బవళ్ళు |

| పుట | పం_క్తి | తప్పు | సవరణ |
| --- | --- | --- | --- |
| 78 | 16 | తలము | తలమును |
| 79 | 1 | పరవశించగ | పారవశ్యముజెంద |
| 80 | 10 | మాటి | మీటి |
| 80 | 15 | ఈ | వీ |
| 81 | 5 | రాదో | రాఁదొ |
| 81 | 9 | రాదో | రాదొ |
| 85 | 2 | ఎంతో | ఎంత |
| ૮6 | 6 | నివృతము | వివృతము |
| 89 | 1 | సంతసమ్మున | సంతసమున |
| 95 | 2 | మనుష్యులు | మనుష్యుల |

# నా తెలుగు మాంచాల - డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ



జననము :-1917

జననీజనకులు :-

శ్రీమతి నాళము సుశీల

మధురకవి శ్రీ నాళము కృష్ణారావుగారు.

భర్తగారు :-

శ్రీ ఊటుకూరి హయగ్రీవ గుప్తగారు,

అడ్వకేటు.



రచయిత్రి కళాప్రపూర్ణ

డా॥ ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

ఇతర రచనలు.

1. అఖిల భారత కవయిత్రులు
2. శ్రీ కన్యక సుప్రభాతము
3. దేవీ స్తవ తారావళి
4. జాతిపిత
5. ఆంధ్రుల సంగీత వాఙ్మయ సేవ
6. మన సాహితి-మధుభారతి
7. కాంతిశిఖరాలు
8. కన్యకమ్మ నివాళి
9. మహిళా విక్రమ సూక్తము
10. లజ్జా కిరీట ధారిణి
11. ఒక చిన్న దివ్వె
12. సదుక్తి మంజరి
13. నా తెలుగు మాంచాల

Printed at : AQUARIUS PRINTERS, Secunderabad—3.